# వైద్యపత్రిక

సంపాదకుడు :

జి. వి. నరసింహాచార్యులు





సంపుటి 1] ది 1—6—48. [సంచిక 3

ఆంగ్లాయుర్వేద, సారూప్య జీవరసాయన,
ప్రకృతి వైద్య విధాన తారతమ్య,
విపులీకృత విశేషార్థ వ్యాఖ్యాన
సహిత వైద్య సచిత్ర మాస పత్రిక.

విడిప్రతి రు 0—5—0



# విషయసూచిక.



---

# విజ్ఞప్తి



మహారాజపోషకులు వారి వారి ఫొటోలను త్వరలో కోరిక.

—సంపాదకుడు



ప్రియతమమైన జనకుని పాదపంకజములకు

కు సు మాం జ లి.



: సంపాదకుని జనకుడు :

శ్రీ మదరవాళ్ తిరుమల మాడభూషి

శ్రీ మా న్
గోడవర్తి లక్ష్మీనర్సింహాచార్యులయ్యవార్లంగారు
చే బ్రో లు.



: మహారాజ పోషకులు :

శ్రీమాన్ కుంచపూడి నర్సింహాచార్యులయ్యావార్లంగారు

చెరుకుమిల్లి అగ్రహారం.





: మహారాజ పోషకులు :

శ్రీయుత గోడిపర్తి వీరాస్వామిగారు

ఆ చం ట.

## : మహారాజపోషకులు :



శ్రీ యుత
ములకల మృత్యుంజయగారు
(రెడీమేడ్ ప్రొడక్షన్, ఏలూరు.)



శ్రీ యుత
గొడవర్తి లక్ష్మయ్యగారు
ఆచంట.



శ్రీ యుత
గొడవర్తి నాగేశ్వరరావుగారు
ఆచంట.



శ్రీ యుత
గొడవర్తి మాధవరావుగారు బి. ఏ.,
ఆచంట.

# మహారాజపోషకులు.

1. శ్రీమాన్ కుంచపూడి నర్సింహాచార్యులయ్యవార్లంగారు, చెరుకుమిల్లి అగ్రహారం.
2. శ్రీమాన్ కుమాండూరి యిడయవల్లి వెంకటనర్సింహాచార్యులయ్యవార్లంగారు, కాళ్ళకూరు.
3. శ్రీమాన్ కుమాండూరి యిడయవల్లి రామానుజాచార్యులయ్యవార్లంగారు, వాడవల్లి.
4. శ్రీమాన్ కుమాండూరి శ్రీనివాసాచార్యులయ్యవార్లంగారు, సీనియరు ప్రొప్రయిటరు, వరదరాజపురం అగ్రహారం.
5. శ్రీమాన్ కుమాండూరి రాఘవాచార్యులయ్యవార్లంగారు, ఆకివీడు.
6. శ్రీయుత చామన వీరాస్వామిగారు, పంచాయతీబోర్డు ప్రెసిడెంటు, వరదరాజపురం అగ్రహారం.
7. శ్రీయుత గోడవర్తి వీరాస్వామిగారు, ఆచంట.
8. శ్రీయుత గోడవర్తి నాగేశ్వరరావుగారు, (వీరాస్వామిగారి జ్యేష్ఠ కుమారులు) ఆచంట.
9. శ్రీయుత గోడవర్తి లక్ష్మయ్యగారు, (వీరాస్వామిగారి ద్వితీయ కుమారులు) ఆచంట.
10. శ్రీయుత గోడవర్తి మాధవరావుగారు బి. ఏ., (వీరాస్వామిగారి మూడవ కుమారులు) ఆచంట.
11. శ్రీయుత తమ్మినీడి రామచంద్రరావుగారు, ఆచంట.
12. శ్రీయుత ములకల సూరన్నగారు, ఉంగుటూరు.
13. శ్రీయుత ములకల మృత్యుంజయుగారు, ప్రొప్రయిటరు, రేడీమేడ్ ప్రొడక్షన్ – ఏలూరు.

## రాజపోషకులు.

1. శ్రీమాన్ పల్లెర్లమూడి కృష్ణమాచార్యులుగారు, మంచిలి.
2. శ్రీయుత అప్పసాని వెంకటరత్నంగారు, నారాయణపురం.
3. శ్రీయుత గొడవర్తి వెంకట్రామయ్యగారు, గ్రామమునసబు. ఆచంట.
4. శ్రీయుత శీతాల శేషయ్యగారు, తల్లాపురం.



## ప్రధానపోషకులు

1. శ్రీయుత గుడిపాటి గురుమూర్తిగారు, వినుకొండ– గుంటూరుజిల్లా
2. శ్రీయుత గుమ్మరేగుల వీరభద్రాచార్యులుగారు, మామిడాడ. ఏలేశ్వరం.
3. శ్రీయుత నడింపల్లి సోమరాజుగారు, చిన నింద్రకొలను.
4. శ్రీయుత నడింపల్లి విశ్వనాధరాజుగారు, చిన నింద్రకొలను.
5. శ్రీయుత నడింపల్లి లక్ష్మీపతిరాజుగారు, చిన నింద్రకొలను.
6. శ్రీయుత నడింపల్లి రామరాజుగారు, చిన నింద్రకొలను.
7. శ్రీయుత చింతలపాటి వెంకటరమణరాజుగారు, చిన నింద్రకొలను
8. శ్రీయుత అయినవల్లి విశ్వనాధంగారు, నారాయణపురం.
9. శ్రీయుత నెక్కంటి తిరపయ్యగారు, ఆచంట.

## పోషకులు (క్రొత్తగా చేరినవారు)

1. శ్రీమాన్ ఎస్. టి. పి. సింగరాచార్యులుగారు, అడవికొలను.
2. శ్రీయుత రావూరి అప్పారావుగారు, నారాయణపురం.
3. శ్రీయుత కాకర్ల సుబ్బారాయుడుగారు, శింగరాజపాలెం.
4. శ్రీయుత గొడవర్తి రామకృష్ణమూర్తిగారు, ఆచంట.

## అభిమానులు (క్రొత్తగా చేరినవారు)

1. శ్రీ H. వెంకట్రావుగారు, పెదపూడి, (B. P. M.)
2. శ్రీ కనుమూరి వెంకటపతిగారు, నారాయణపురం.
3. శ్రీ పల్లాటి సూర్యనారాయణమూర్తిగారు, నారాయణపురం.
4. శ్రీ మతుకుమిల్లి నారాయణుడుగారు, నారాయణపురం,
5. శ్రీ వెంపరాల వెంకటేశ్వర్లుగారు, తల్లాపురం.
6. శ్రీ క. వెంకటరాజుగారు, పెదనింద్రకొలను.
7. శ్రీ గద్దే గంగరాజుగారు, శింగరాజపాలెం.
8. శ్రీ కొఠారి సత్యంగారు, శింగరాజపాలెం.
9. శ్రీ కొఠారి దశరథరామయ్యగారు, శింగరాజపాలెం.
10. శ్రీ అబ్బూరి అప్పారావుగారు, ,,
11. శ్రీ నెక్కలపూడి రామచంద్రరావుగారు ,,
12. శ్రీ సుంకవల్లి భాస్కరరావుగారు ,,
13. శ్రీ కొఠారి నర్సింహారావుగారు ,,
14. శ్రీ చివుకుల రామశేషయ్యగారు ,,
15. శ్రీ గద్దే అప్పారావుగారు ,,
16. శ్రీ నెక్కలపూడి వీరాస్వామిగారు ,,
17. శ్రీ చిలుకూరి ఆదినారాయణగారు ,,
18. శ్రీ కొఠారి పర్వతాలుగారు ,,
19. శ్రీ గన్నం చంద్రయ్యగారు ,,
20. శ్రీ క. వెంకట్రాజుగారు, పెదనింద్రకొలను.
21. శ్రీ గొడవర్తి సుబ్బారావుగారు, ఆచంట.
22. శ్రీ గొడవర్తి బాపన్నగారు ,,
23. శ్రీ చిలుకూరి పట్టాభిగారు ,,
24. శ్రీ Ch. వనమరాజుగారు, మారుటేరు.
25. శ్రీ అమలాపురపు బ్రహ్మంగారు, పాలకొల్లు.

# వైద్యపత్రిక చందా పద్ధతులు.

1. శాశ్వత మహారాజపోషకులు : రు 500-0-0
ఇట్టివారి ఫొటో ముఖపత్రమున శాశ్వతముగ వేయబడుచుండును. యెల్లపుడును పత్రిక పంపబడును.
2. మహారాజపోషకులు : రు 116-0-0
వీరి ఫొటోను సంవత్సరమువరకు ప్రకటింపబడును. యెల్లపుడును పత్రిక పంపబడును.
3. రాజపోషకులు : రు 50-0-0
వీరికికూడ యెల్లపుడు పత్రిక పంపబడును. సంవత్సరము వరకు వీరి నామధేయము పత్రికలో ప్రచురింపబడును.
4. ప్రధాన పోషకులు : రు 25-0-0
వీరి నామధేయముకూడ పత్రికలో వేయబడును. 8 సంవత్సరముల వరకును చందాతో నిమిత్తం లేకుండా వీరికి పేపరు పంపబడును.
5. పోషకులు : రు 10-0-0
వీరి పేరు వేయబడును. మూడు సంవత్సరములవరకు పేపరు పంపబడును.
6. అభిమానులు : వీరిపేరు వేయబడును. రు 5-0-0
రెండు సంవత్సరములు పేపరు పంపబడును.

సంవత్సరచందా రు 3—0—0

ఏవిధమగు చందాలైనను మణియార్డరుద్వారా పంపవలెను. చందా చేరగనే సంపాదకుని చేవ్రాలుగల రశీదు పంపబడును.

## అడ్వరుటైజుమెంటు రేట్లు.

| | | |
|---|---|---|
| నిండుపుటకు | దఫాకు | రు 30 |
| సగము పుటకు | ,, | 15 |
| నాల్గోవంతు పుటకు | ,, | 8 |

ఇంక తక్కువస్థలములో ప్రకటనలు వేయబడవు. ముఖ్యముగా వైద్య సంబంధమగు ప్రకటనలకు ప్రాముఖ్య మీయబడును.

ప్రకటనలు వేయువారు, చందా ధనమును పంపువారు ఈ క్రింది చిరునామాకు పంపవలయును. సంవత్సరమునకు ఒకేమారు ప్రచురణ నిమిత్తము స్థలమును కంట్రాక్టు చేయువారు వివరములకు వ్రాసి కనుగొనవలయును. ప్రకటన చార్జీలు ముందుగా పంపవలెను.

వైద్యపత్రికకార్యాలయం,
చేబ్రోలు (P. O.) ప. గో. జిల్లా.

---

## ఆయుర్వేదశాస్త్రప్రకారము

# నక్షత్రఫలములు.

1. అశ్వని నక్షత్రమందు జ్వరము వచ్చినచో 9 రోజులలో తగ్గును. అట్లు తగ్గనిచో రెండు నెలలు బాధించును.
2. భరణినక్షత్రమందు వచ్చిన జ్వరము 11 రోజులకు విడువనిచో మరణము గలుగును.
3. కృత్తికానక్షత్రమున గలిగిన జ్వరము 9 రోజులుగాని 60 రోజులు గాని పీడించి విడచును. భయములేదు.
4. రోహిణియందు వచ్చిన జ్వరము 7 దినములుండును.
5. మృగశిరయందు వచ్చిన జ్వరము నెల బాధించును.
6. ఆరుద్రయందు జ్వరము మానవుని చంపును.
7. పునర్వసునందు గలిగిన జ్వరము 7 రోజులు లేక 20 రోజులు గాని యుండును. అటుపైన జరిగినచో మరణము నొందును.
8. పుష్యమి మరణమును గలిగించును.
9. ఆశ్లేష 9 రోజులలో తగ్గును. అటుపోకున్న చంపివేయును.
10. మఖయందలి జ్వరము 20 రోజులలో తగ్గును. అటుగాదేని 29 రోజులు దాటిన పిదప జంపును.
11. పుబ్బయందు గలిగిన జ్వరము 7 దినములు బాధించును. అట్లు పోకున్న రెండు మాసముల తుదను జంపును.

12. ఉత్తరయందలి జ్వరము 7 రోజులు దాటినచో రెండు నెలలు బాధించును.
13. హస్త 15 దినములుండును.
14. చిత్త 11 దినములుండును.
15. స్వాతియందలి జ్వరము రెండుమాసములలో తగ్గని యెడల చంపును.
16. విశాఖనక్షత్రము సందంకురించిన జ్వరము 10 రోజులలోతగ్గును.
17. అనూరాధయందలి జ్వరము 15 దినములలో బాగుపడును.
18. జ్యేష్ఠ 15 రోజులు బాధించి విడుచును. ఆ పైని జరిగినచో చంపును.
19. మూల 9 రోజులలో తగ్గును. అటుగానిచో రెండు మాసము లుండును.
20. పూర్వాషాఢ యందలి జ్వరము 15 రోజులలో తగ్గకున్న చంపును.
21. ఉత్తరాషాఢ యందలి జ్వరము ఒకనెల యుండును.
22. శ్రవణము 11 రోజులుండును.
23. ధనిష్ఠ 15 రోజులలో తగ్గును. అటుగాకున్న రెండు నెలలుండును.
24. శతభిషము 11 రోజులలో తగ్గును. లేకున్న నలభై రోజులుండును.
25. పూర్వాభాద్ర 20 రోజులుండును. అటుపై నున్నచో చంపును.
26. ఉత్తరాభాద్ర 7 రోజులుండును.
27. రేవతి 10 రోజులుండును.

## మరణయోగములు

భరణితో గూడిన ఆదివారము, చిత్తతో కూడిన సోమవారము ఉత్తరాషాఢతో కూడిన మంగళవారము, హస్తతో కూడిన బుధవారము, జ్యేష్ఠతో కూడిన గురువారము, పూర్వాషాఢతో కూడిన శుక్రవారము, రేవతి నక్షత్రముతో కూడిన శనివారమందును జ్వరము వచ్చిన నరులు మరణింతురని ఆయుర్వేద శాస్త్రము తెలుపుచున్నది

# గంటల పంచాంగము. (దృగ్గణితం)

బ్రహ్మశ్రీ పరిమి వెంకట సుబ్రహ్మణ్య దైవజ్ఞశర్మగారిచే రచింపబడినది.

శ్రీ సర్వధారినామ సం॥ర జ్యేష్ఠ మాసము ది 8-6-1948 సం॥రం ల 6-7-1948 వరకు.

| తేదీ | |
|---|---|
| 8 | శు. పా. మం. సా. గం. 4-6 మృగ. సా. 4-33 రా. వ. గం. 12-20 ల. 1-49 కు. రాహు. ప. 3-17 ల 4-55 కు. చంద్ర దర్శనం. |
| 9 | విది. బు. ప. 1-31 ఆర్ద్ర. ప. 2-46. రా. వ. 1-47 ల. 3-15 రాహు. ప. 12-2 ల 1-40 తిథి ద్వయం. |
| 10 | తది. గు. ప. 10-45 పున. ప. 12-47. రా. వ. 8-8 ల 9-36 కు. రాహు. ప. 1-40 ల 3-18 కు తిథి చతుర్థి. |
| 11 | చవి. శు. ఉ. 7-56 పస్యా. పం. తె. 5-11. పుష్య. ప. 10-47. రా. వ. 10-34 ల 12-2. రాహు. ప. 10-24 ల 12-2 కు. |
| 12 | షష్ఠి. శ. రా. 2-33. ఆశ్రే. ప. 8-52. రా. వ. 7-58 ల 9.27 కు. రాహు. ప. 8-47 ల 10-25 కు. |
| 13 | స. ఆ. రా. 12-13 మఖ. ఉ. 7-5 ప. వ. 2-35 ల 4-5 కు. రాహు. సా. 4-57 ల 6-35 కు భాను సప్తమి. |
| 14 | అష్ట. సో. రా. 10-9 పూ.ఫ. ఉ. 5-34. ఉ.ఫ. తె. 4-23. ప.వ.12-27ల 1-59 కు రాహు.ఉ.7-9 ల 8-47కు. మిధునమందు రవి॥ప్ర॥ప.గం.12-33. |
| 15 | న. మం. రా. 8-27. హస్త. రా. 3-34 ప వ. 12-30 ల 2-3 కు. రాహు. ప. 3 19 ల 4-57 కు. |
| 16 | ద. బు. సా. 7-6 చిత్త. రా. 3-7. ప. వ. 11-25 ల 12-59 కు. రాహు. ప. 12-3 ల 1-41 కు. |
| 17 | ఏ. గు. సా. 6-10. స్వా. రా. 3-3 ప. వ. 8-42 ల 10-18 కు. రాహు. ప. 1-41 ల 3-20. మతత్రయ ఏకాదశి గురు ఏకాదశి. |
| 18 | ద్వా. శు. సా. 5-37, విశా. రా. 3-23. ప. వ. 8-43 ల 10-21 కు. రాహు. ప. 10-25 ల 12-3 కు. |
| 19 | త్ర. శ. సా. 5-30 అనూ. తె. 4-7. ప. వ. 7-31 ల 9-10 కు. రాహు. ప. 8-48 ల 10-26 కు. శుక్రాస్త సమయం రా. గం 12-40. శని త్రయోదశి. |
| 20 | చతు. ఆ. సా. 5-43. జ్యే. తె. 5-12. ప. వ 9-58 ల 11-39 కు. రాహు. సా. 4-59 ల 6-37 కు. |
| 21 | ○ పూ. సో. సా. 6-21 మూ. గం. 24-0 ప. వ. 1-43 ల 3-25 కు. తె. వ. 5-0. రాహు. ఉ 7-10 ల 8-48 కు ఆర్ద్ర 1 వ పా॥ రవి॥ ప్ర॥ ప॥ గం॥ 12-11 కర్కాటకాయనం సా. గం 5-32 దక్షిణాయన పుణ్యకాలము. |

1948 నవంబరు నెల

22 | బ. పా. మం. సా. 7_23 మూ. ఉ. 6_42. శేషవర్జ్యం ఉ॥ 6_42 కు. సా. వ. 5_3 ల 6_47 కు. రాహు. ప. 3_21 ల 4_59 కు. గు॥ వృ॥ వక్రిము॥ రా. గం. 12_2.

23 | విది. బు. రా. 8_52. పూ. షా. ప. 8_36. సా. వ. 5_22 ల 7_8 కు. రాహు. ప. 12_4 ల 1_42 కు.

24 | తది. గు. రా. 10_46. ఉ. షా. ప. 10_56. ప. వ. 3_22 ల 5_8 కు. రాహు. ప. 1_43 ల 3_22 కు.

25 | చవి. శు. రా. 12_53. శ్రొ. ప. 1_33. సా. వ. 6_1 ల 7_49 కు. రాహు ప. 10_27 ల 12_5 కు.

26 | పం. శ. రా. 3_15 ధని. సా. 4_25. రా. వ. 12_31 ల 2_19 కు. రాహు. ప, 8_49 ల 10_27 కు.

27 | షష్ఠి. ఆ. గం. 24_0. శత. సా. 7_23. రా. వ. 2_34 ల 4_21 కు. రాహు. సా. 5_0 ల 6_38 కు.

28 | షష్ఠి. సో. ఉ. 5_40. పూ. భా. రా. 10_18. వర్జ్యంలేదు. రాహు. ఉ. 7_12 ల 8_50 కు.

29 | స. మం. ఉ 7_52 ఉ. భా. రా. 12_51 ప. వ. 8_56 ల 10_42 కు. రాహు. ప. 3_22 ల 5_0 శుక్రోదయం సా. గం 7_36.

30 | అష్ట. బు. ప. 9_40 రేవ. రా. 2_54. ప. వ. 1_53 ల 3_37 కు. రాహు. ప. 12_6 ల 1_44 కు.

1948 డిసెంబరు నెల

1 | న. గు. ప. 10_53. అశ్వి. తె. 4_18. రా. వ. 12_4 ల 1_46 కు. రాహు. ప. 1_45 ల 3_23 కు.

2 | ద. శు. ప. 11_23 భర. తె. 4_55. ప. వ. 2_9 ల 3_47 కు. రాహు. ప. 10_29 ల 12_7 కు.

3 | ఏ. శ. ప. 11_4. కృత్తి. తె. 4_43. సా. వ. 4_48 ల 6_23 కు. రాహు. ప. 8_51 ల 10_29 కు మతత్రయ యేకాదశి.

4 | ద్వా. ఆ. ప. 9_55. రో. రా. 3_45. రా. వ. 8_4 ల 9_36 రాహు. సా. 5_1 ల 6_39 కు.

5 | త్రి. సో. ఉ. 8_2 ఏష్యా చతు. తె. 5_32. మృగ. రా. 2_11. ప. వ. 9_0 ల 10_29 కు రాహు. ఉ. 7_14 ల 8_52 కు. పున 1 పా॥ర॥ప్ర॥ ప. గం 11_48 కన్యా రా॥కు॥ప్ర॥ ఉ. గం 7_24 మాసశివరాత్రి.

6 | ● అమా. మం. రా. 2_33 ఆర్ద్ర రా. 12_5 ప. వ. 9_51 ల 11_18 కు. రాహు. ప. 3_23 ల 5_1 కు.

---

అక్షర గుర్తులు:_ ఉ=ఉదయం, మ=మధ్యాహ్నం, సా=సాయంత్రం, ప=పగలు, తె=తెల్లవారు సమయము వ = వర్జ్యము, ల=లగాయితు, రా = రాత్రి, రాహు = రాహుకాలము. శేషవర్జ్యము ఉదయమున యుండును. కు=వరకు. రాహుకాలమందు నూతనముగా రోగిని పరీక్షించుట, ఔషధము యిచ్చుట పుచ్చుకొనుట కూడదు.

# ప్రశంసాపత్రములు.

ఆర్యా!

మీచే నడుపబడుచున్న వైద్యపత్రిక, నన్ను సంతుష్టాంతరంగునిగా చేసినది. ఆయుర్వేదశాస్త్రము సంపూర్ణశాస్త్రమని అంగీకరించుచు ఆయుర్వేద శాస్త్రమునకు సంబంధించి చికిత్సచేయు వైద్యులకు ఆయుర్వేద శాస్త్రము చాల లోపమని దార్శనిక సిద్ధాంతముల యందనురక్తులు ప్రత్యక్షములపై ఆధారపడువారు నిందించుచుందురు. ఇట్లు నిందచేయుటకు గల కారణము అన్యవైద్య తంత్రములు ప్రబలుట వాటియందుగల వ్యామోహమే. అన్యవైద్యతంత్రముల యొక్క ప్రాశస్త్యతనెరింగిన పండితులును ఆయుర్వేదమునందు కలిగియున్నారు. వారును తగురీతుల సేవచేయుచున్నారు. ప్రస్తుతము పాశ్చాత్య వైద్యవిధానము యిప్పటి ప్రభుత్వము వారి పోషణ యందుండుటచే పాశ్చాత్య వైద్యముతోపాటు దానిలో యిమిడియున్న వైద్య విధానములన్నియు ప్రాశస్త్యతనంది వర్ధిల్లుటకు ఉచితమగు అవకాశములు గలిగియున్నవి. దేశమునందు ఎన్నివైద్యములు ప్రబలినను ఆయుర్వేదము ఎక్కువమంది ప్రజలకు సేవచేయు మన్నట్లు ప్రభుత్వమువారును గుర్తెరుంగక పోలేదు. అట్టితరి ఆయుర్వేదమునకు ప్రోత్సాహ మొసంగు చుండుట ప్రభుత్వమువారి ధర్మము. ఆయుర్వేదమున్నగు దేశీయ వైద్య విధానములను ఆలోపతిని కలిపి ఒకే వైద్యవిధానముగా చేయవలెనను తలంపు యిటీవల ప్రభుత్వము వారిచే వెల్లడింపబడినదనియు అవి పరస్పర భిన్నములను వివరములతో శ్రీ. చి. వే. సు. అవధానులుగారు యీ పత్రికయందే వక్కపరచియున్నారు. ఐనను స్వశాస్త్ర సిద్ధాంతములతో అన్యశాస్త్ర సిద్ధాంతములకు కలిగియుండు సాధర్మ్యవైధర్మ్యములను పరిశీలించుచు విజ్ఞానార్జన మొనర్చుట జ్ఞానాభివృద్ధికి సాధనమగు ననెడి పద్ధతులతో బాల తంత్రము అగదతంత్రము ప్రత్యక్షముగా చూపబడిన శారీర పటములు మున్నగు విషయములతో కూడిన వివరములుగల ఈ వైద్య పత్రిక ఆయుర్వేద లోకమునకు చాల అవసరము. కనుక ఆయుర్వేదము

అన్యవైద్య సాంప్రదాయములు నెరింగిన పండితులు యిట్టి పత్రికలక
తోడ్పడినప్పుడే వర్ధిల్లగలదు. ప్రతి పత్రికయు శాస్త్రవిషయములతో
పాటు ప్రత్యక్షము ప్రమాణము అనుభవము మున్నగునవి చూప
నప్పుడే. పత్రికా పాఠకుల విజ్ఞానాభివృద్ధికి మార్గ దర్శము కాగలదు
తాము తమ సంపాదకీయ వ్యాసమున, నొకవిధానమును మరియొక
విధానమధిక్షేపించుట మినహా మిగిలిన దేదియు గనిపించదు. అట్టి
తగవులాటనుమాని సమిష్టివైద్య తత్వముల నాచరించెదరను నా
తోడనే యీపత్రిక వెలువడిన దనెడి తమ ఆశయమునకు నాకృతజ్ఞతన
తెలుపుచున్నాను.

ఆంధ్రరాష్ట్రమునందు ఆయుర్వేద పత్రికలు ఆయుర్వేద పురోభి
వృద్ధి నిమిత్తము సేవచేయుటకు అత్యంత అవసరము కలిగి యున్న
ప్పటికిని, పత్రికలయొక్క ప్రాముఖ్యతను గ్రహించి దాని నాదరించి
పోషించువారు చాలతక్కువ. యిట్టి మహదాశయములతో కూడి
సర్వాంగ సౌందర్యముగా నడపు పత్రికకు, విరివిగా ధనముండవలెను
మహారాజపోషకులు, రాజపోషకులు, ప్రధానపోషకులు, అభిమానులు
మున్నగువారి మన్ననలంది మీరు చేయబూనుకొన్న సేవ అద్వితీయ
మైనది. ఎవరు ఎన్ని విధముల సహాయముచేయ బూనుకొన్నప్పటికిని
యీ వైద్యపత్రిక, ఆయుర్వేద వైద్యుల జ్ఞానాభివృద్ధికి ఉపకరించ
ననెడి విశ్వాసముతో ఆయుర్వేద వైద్యులెల్లరు చందాదారులుగ
చేరి పత్రికను ప్రోత్సహించవలెనని కోరుచున్నాను.

యిట్టి ఆశయములతో కూడిన, యీ వైద్యపత్రిక చిరస్థాయిగ
వర్ధిల్లుగాక యనియు దీనిని సక్రమపద్ధతులతో నడపుటకు అనుకూ
మగుశక్తి నిచ్చి సర్వదా మీకు తోడ్పడవలెనని శ్రీ ధన్వంతరి
ప్రార్థించు చున్నాను.

వైద్యవిద్వాన్ అల్లెన దామోదరరావు
ప్రధాన కార్యదర్శి.
వైద్యవిద్వాన్ పట్టభద్ర సమ్మేళనము
కార్యస్థానం — పాలకొండ
(విశాఖపట్నం జిల్లా.)

వైద్యకళ :—మార్చి, ఏప్రియల్ 1948 సంచికలు 7, 8.

"యిందు వైద్యుల కుపయుక్తములైన అనేక విషయములను ఇంగ్లీషు, ఆయుర్వేద, సారూప్య, ప్రకృతి వైద్యసిద్ధాంతములను, అనుభవ యోగములను; తాళపత్ర యోగములను యిందు ప్రచురింపబడినవి"

శ్రీవైష్ణవ పత్రిక :—చైత్రమాసము. సంచిక 1. ది 10-5-1948.

"ప్రథమ సంపుటం ప్రథమ సంచిక మా కందినందులకు మేము ఎంతయు సంతసించుచున్నాము. ఇందు అలోపతి, హోమియోపతి, నరోపతి, ఆయుర్వేదము, యూనాని, వైద్యశాస్త్రములలోని గుణాగుణములను జక్కగా చర్చించి నిర్ణయింప బడుచున్నది.

మరియు దేశ సౌభాగ్యమునకు మూలపురుషుడైన కర్షకునకు ప్రధమ సాధనమగు, పశువుల రక్షణ విధానమునుగూడ నుచితరీతిని వివరించుచున్నారు.

ప్రతి గ్రామస్థులును ఈ పత్రికను తప్పక తెప్పించుకొనుచు ఆరోగ్య సూత్రముల నెరింగి సుఖించవలెనని సోదరుల నందరను ప్రోత్సహించు చున్నాము."



☞ మనవి : వ్యాసములు వగైరా ప్రతినెల 5 వ తేదీలోగా మా కార్యాలయమునకు చేరవలెను.

—సంపాదకుడు.



# వైద్యపత్రిక

## * సంపాదకీయము *


| సంపుటి 1 | 1—6—1948 మంగళవారం. | సంచిక 3 |
|---|---|---|


క్రిమిసిద్ధాంతము:—(Bacteriology.)

వర్ష జలమునందు మనకండ్ల కగపడని జీవులున్నట్లు ప్రారంభమున కనిపెట్టిన యతడొక డచ్చి దేశస్థుడట ! అతను మొదట దుర్భిణీ యంత్రమును కనిపెట్టిన మహనీయుడట ! తనచే కనిపెట్టబడిన దుర్భిణీ యంత్ర (Mycroscope) సహాయమున వర్ష జలమునందలి నొక చుక్కనందు క్రరపుడకవంటి పురుగు లున్నట్లు క్రీ. శ. 1670 వ సంవత్సరములో కనిపెట్టి చకితుడై నాడట !

"The first man to set eyes on the minute living forms which we call mycrobes, germs, or bacteria, was a Dutch draper, Anthony Van Leeuwenhoek who for a habby ground lenses with which he constructed mycroscopes.

One day he placed a drop of water from a rain water butt under one of his mycroscopes and was surprised to see rod-shaped organisms swimming about in the water. This was about the year 1670."

మరియు,

పేశ్చూర్ యనునతడు క్రీ. శ. 1870 వ సంవత్సరములో సూతికజ్వరముయొక్క చీమును దుర్భిణి యంత్రముతో పరీక్షించి, యందు గొలుసు ఆకారముగల పురుగులున్నట్లు కనిపెట్టి; యట్టిపురుగుల కారణముగనే సూతికవ్యాధి యంకురించుననియు, విశేషించి వ్యాధులు క్రిమిజములనియు కనిపెట్టెనట !!

• "Pasteur in 1870 examined pus from a case of puerperal fever and saw in it a microbe in the form of chain. He immediately jumped to the conclusion that the microbe was the cause of the fever, and enunciated his germ theary to account for disease.

As time went on more and more germs found causing various illnesses of men, animals and plants and so on."

దీనినిఁ బట్టిచూచి నూతిలో నివసించుచూ, సముద్రమున్న సంగతియో యెరుగని యొకానొక తాబేలు, సముద్రపు తాబేలుతో తన నూయియే పెద్దదని వాదించినట్లులేదా? ఇట్టి వింతలను, విశేషాలను జూచి పాపము ఆయుర్వేదమున్న పూర్తి పరిచయము లేని కొందరు వైద్యసోదరులును, మొత్తమాత్రమును ఆయుర్వేదమున్న తలకెక్కని వైద్యేతర సోదరులునుకూడ పై వ్రాతలకు ళళాయించి, మనదేశీయ వైద్యమును కడుదూరముగ విసరికొట్టుటలేదా? ఇంతమాత్రమున వేదకాలమునాటినుండి, ప్రపంచమును వీడి పోలేక కొన ఊపిరితో, నెప్పటికేని మంచిరోజులు రాకుండునా యనెడి వేరాశతో (రాజపోషణలేని దానిని వేరాశయే యనవలెనుగదా!) జీవచ్ఛవమై యున్న ఓ ఆయుర్వేదమా నీకు గూడ మంచిరోజులు రాగలవు. తల్లీ! ఓపికబట్టుము. పడ్డగోడలు పడినట్లుండవుగదా!

ఉ. కొంచెపు పెంటపేరితిను కుక్కుట ముల్లినుఁ గందిగింజ గా
దంచుఁ ద్యజించినఁ దనె యహో యపకీర్తియె నీకు రత్నమా
కాంచన పీఠి నిన్ను నిడి కాంత కిరీటములందు నిల్పి య
భ్యంచితరీతి మస్తకములందు ధరింపరె రాజశేఖరుల్.

పై పద్యము ఆంధ్రనాటక పితామహబిరుదాంకితులై, దివంగతులైన శ్రీమాన్ బళ్ళారి కృష్ణమాచార్యులుగారు తమచిత్రనళీయ ప్రస్తావనయందు కొండొక కారణమున నుదహరించిరి. అదే పద్యభావమిట యవసరమగుటచే దాని నిటనుదహరింపవలసి వచ్చినది.

"నీచవు పెంటయీ నేరితినెడి కోడికి, ఒకానొక పెంటప్రోగునందు రత్నమొకటి కన్పించెనట! అద్దానిని కోడి కండగింజగా భావించి, ముక్కుతో పొడిచి, ఛీ! కండగింజనుకొంటినే? ఇది పనికిమాలినరాయి, యని తన కాలితో పెంటకుప్పలోని రాతినిదువ్వి దూరముగా విసరెనట!

అంతమాత్రమున! రత్నమా – నీకు అపకీర్తియా? కాదు. ఏలన బంగారు పీఠమునందుగాని బంగారు కిరీటమందుగాని, నిన్ను బెట్టి మహారాజులు తమ తలలందు ధరింపరే!!" యని రత్నమును హెచ్చరించినట్లు కవి పద్యరూపమున చిత్రించెను. శ్రీ ఆచార్యుల వారు రచించిన పద్యభావమెంతమనోహరము! యెంత భావోద్రేకమును వెదజల్లుచున్నదో చూడుడు! ఆయుర్వేదము సశాస్త్రీయమని మేనెలయందలి సంపాదకీయమందు తెల్పియే యుంటిమి. అది సశాస్త్రీయమనియే ముమ్మాటికిని చెప్పగలను. అటుగాదని చెప్పుటకెవరైన సాహసించిన, యది సాహసమేయనిపించుకొనును గాని మఱియొండుగాదు.

ఏ విధానమైనను సశాస్త్రీయమైన ఆయుర్వేదము ననుకరించవలసినదే కాని మఱియొక గత్యంతరములేదు. ఏనాడో అనగా క్రీ॥ శ * 775 సం॥ పూర్వమే మాధవ నిదానాది పూర్వగ్రంధములు వ్యాధులు క్రిమిజములని పేర్కొని యుండుట విస్మరింపరానిది.

* క్రీ.శ 775 సం. పూర్వమే మాధవ నిదానము పారశీకమునుండియో సంస్కృతమునుండియో అరబ్బీ భాషలోనికి పరివర్తనమై పఠన పాఠములలో నున్నట్లు ప్రొఫె. విల్సన్ దొరగారు వ్రాసిన చరిత్రవలన దెలియుచున్నది. ఈ గ్రంధము గుజరాతీ, మరాటీ, బంగాళీ, హిందీ, లాటిన్ మొదలగు భాషలలోనికిగూడ పరివర్తిత మొందినట్లుకూడ వ్రాసియుండిరి.

"నిదానేమాధవశ్శ్రేష్ఠః" అను నార్యోక్తిచే రోగనిర్ణాయక గ్రంథములలో మాధవ నిదానమే కడుఖ్యాతిగాంచిన యుద్గ్రంథము. అందే వ్యాధులు క్రిమిజములని పేర్కొనబడి యుండగా క్రీ॥ శ 1670 సం॥ లో డచ్చిదేశములోని బట్టల వర్తకు డొకడు తనచే కనిపెట్ట బడిన సూక్ష్మదర్శిని సహాయమున నీటిలో పురుగులున్నట్లును, * క్రీ. శ. 1870 లో పేట్స్చార్ అనునతడు సూతిక జ్వరము యొక్క చీమునందు గొలుసువంటి పురుగులున్నట్లు కనిపెట్టిన వారిలో ప్రథము డనియు పశ్చిమ దేశీయులు తమ గ్రంథములందు వ్రాసు కొన్నంత మాత్రమున వారికి గొప్పలేదు; మన ఆయుర్వేదమునకున్న ఖ్యాతి పోనేరదు. అయితే అన్యదేశీయులు మన గ్రంథస్థములగు యపూర్వ విషయములను చర్చించి తమ రాజపోషణ సహాయమున విశేష వ్యాప్తిలోనికి దెచ్చిరనుటకు ఏ మాత్రము సందేహము లేదు.

క్రిములను ప్రత్యక్షముగా ప్రారంభమున సూక్ష్మ దర్శిని ద్వారా చూచినది పశ్చిమ దేశీయులై యుండవచ్చును గాని అంతకు పూర్వమే మన పూర్వులగు చరకాది ఋషులు సూక్ష్మ దర్శిని కంటె అనేక వేల మడుంగుల బలవత్తరమైన తమ దివ్యదృష్టితో నిట్టి సూక్ష్మాతి సూక్ష్మములైన వాటిని పరికించి ప్రజోపయోగము కొఱకై తమ గ్రంథముల ద్వారా ప్రపంచమునకు వెల్లడించి యుండిరి.

హేతువాదులు సూక్ష్మదర్శిని యంత్రముద్వారా తప్ప తదన్య విధానమెద్దియు సూక్ష్మజీవులను పరికించుటకు వలను పడదని వాదింప జూతురు. అట్టివారికొక్క మనవి — మనపూర్వులగు గణిత సిద్ధాంతు (పంచాంగకర్తల) కు నక్షత్రగణితశాల (Observatory) లు లేవు. ఆ కారణమున పంచాంగము లాగిపోయినవా? అట్లే క్రిములనుగూడా కనిపెట్టిరని తలంపవలెను.

---

* వ్యాధులు క్రిమిజములని పేర్కొనబడిన మాధవ నిదానమునకు వ్యాఖ్యాత కారులగు విజయరక్షితుడు క్రీ॥ శ 1240 సం॥ వాడనియు వాచస్పతి క్రీ॥ శ 1260 లోని వాడనియు తెలియుచుండుటచే క్రీ. శ. 1870 సం॥ పూర్వమే వ్యాధులకు కార ణము క్రిములని తెలిసికొన బడెను.

దీనికితోడు శ్రీయుత చి॥ వే॥ సు॥ అవధానులుగారు (నూజివీడు మే నెల సంచికయందు "ప్రచురించిన" ప్రభుత్వము ఆరోగ్యము అనెడి తమ వ్యాసరాజముయొక్క భావము మెచ్చదగినదే గాని) అలోపతి క్రిమి సిద్ధాంతములో వికృతిస్థితికి వచ్చినట్లు వ్రాయుటయు ఆయుర్వేదాది ఇతరవిధానములకు తద్విధానము (క్రిమిసిద్ధాంతము) వ్యతిరిక్తమని సూచించుట సమంజసముకాదు. ఇట్టి వ్యాసములలోని యుద్దిక్తములు మన ప్రాచీన ఆయుర్వేద శాస్త్రమునకే నొకానొక సమయమున గొడ్డలి పెట్టులు కాకుండునా ?

పూర్వపు హిందూదేశము యొక్క సౌన్నత్యమునుజూచి, నాటి ప్రభువులను మెప్పించియో, వంచించియో, లేక దొంగిలించియో మన అపూర్వ గ్రంథరాజములను పరదేశీయులుగొనిపోయి ఏతద్గ్రంథములలోని అపూర్వవిషయముల నొక్కొకటిగాదీసి తమ తమ ప్రభుపోషణలనంది కృషిజేసి నభివృద్ధిలోనికి గొనివచ్చినందులకు మన మభినందింపవలసినదేగాని ఎంతమాత్రమును మన సోదర వైద్య సంస్థను దూషించుటగాని, నిరాదరించుటగాని, నిరాకరించుటగాని తగిన పనియా ?

వాస్తవముగా వారికి రాజపోషణ యున్నదన్నమాట వాస్తవమే. మనకు లేని విషయముగూడా వాస్తవమే. మనకే నాటికైనా రాజపోషణలభించక పోవునా ? అట్టి రాజపోషణకై మనము పెనుగులాడి మన ప్రఖ్యాతిని ప్రపంచమునకు వెల్లడింప వలసినదేగాని అన్యవిధాన దూషణలతో పైకి రాజాలము—నుమ్మాటికిని రాజాలము.

దేశాభిమానులు మన ఆయుర్వేదమునకు దోహద మిచ్చిన నాడే మనముకూడా ప్రస్తుతమున మిక్కిలి అభివృద్ధి చెందిన ఇతర వైద్య విధానమనబడే బురకాలో నున్న మన ఆయుర్వేదమును బయటికి దీసికొని వచ్చి మన స్వంతమనిపించుకోగలమని ముమ్మాటికిని చాటి చెప్పగలము. ఏయే వైద్య విధానముల నైనను హిందూ

దేశము యొక్క పూర్వపు వైద్య సిద్ధాంతములు ఆయుర్వేదీయ
ములే నని ముమ్మాటికి నమ్మి తీరవలెను.

మన ఆయుర్వేదము ఇతర దేశములకు వలస వెళ్లి అచటచట
స్థిరపడి విదేశీయాచారముల కలవడి మన దేశమునకు మరల మారు
పేర్లతో అన్య రూపములతో వచ్చి మనకును మధ్యస్థించి ఉద్రేకి
తులనొనర్చుచున్నదియేగాని మఱి యొండుగాదు.

దత్తతనొందినంత మాత్రమున మన సోదరుడన్యుడగునా?
ఒకే గర్భమున జన్మించిన రక్తమే మగుచున్నది. దత్తత సోద
రుడు యభివృద్ధిలో నున్నంతమాత్రమున మన మతనిని హేయముగా
నేల చూడవలెను? మన ఆయుర్వేదము ఇతరులకు దత్తత అయినట్లు
తలంపరాదా?

నేటి పరిస్థితులను బట్టి మన ఆయుర్వేదమున కింకను మంచి
రోజులు వచ్చియుండలేదని విచారించవలెను గాని తదితర వైద్య
విధానములను గురించి హేళన లనవసరము. ఏ వైద్యవిధానములైనను
రాజపోషణలేని సమయమున అనుగంటి తీరవలసినదే. మన ప్రభుత్వము
మన ప్రాచీనాయుర్వేదము నభివృద్ధికి తేవలెనని సత్సంకల్పము నందిన
నప్పుడు మాత్రమే ఆయుర్వేదముకూడా మరల ఉగిర్ఫల పుష్ప
భరితము కాగలదు. క్రిమి సిద్ధాంతము అలోపతీయమే కాదనియు
ఆయుర్వేదీయమేననియు మరల నింకొకసారి హెచ్చరించవలసివచ్చి
నందులకు మన్నింపవలెను.

# పశుశాస్త్రము.



ఆబోతు:— మంచి లక్షణములు గల యెద్దును చూచి సాధారణముగా ప్రతి గ్రామస్థులును ఆబోతుగా నచ్చువేసి విడచెదరు. ఇట్టి యాబోతులను మన హిందువులు యతి శ్రద్ధాభక్తులు గలిగి పూజించుచు, పోషించెదరు. వీటి నొకచోట బంధించక, యే పంటచేలోపడి మేసినను రైతుగాని, ఇతరులుగాని దానిని తరమక విచ్చలవిడిగా మేయనిచ్చెదరు. ఆబోతులచే నెవ్వరును పనిచేయించరు. స్వేచ్ఛగా మేతమేసి, తన ఇష్టమువచ్చినచోట విశ్రమించి నెమరవేయుచు నిశ్చింతగా జీవించుచు, నిక్కలి శరీరసౌష్ఠవము, బలమును గలిగి యుండును. ఇట్టి యాబోతులను గ్రామస్థులు సమిష్టిగా నచ్చుబోయుటయేగాక తాహతగలవారు పుణ్యమనియెంచి, ప్రత్యేకించి అచ్చువేసి విడచుటయు కూడ గలదు. ఇట్టి యాబోతులు ఆవులు యెదకెందినపుడు, మంచిరకము దూడల నిమిత్తము దాటించుటకుపయోగపడును.

పశువులను దాటించుట:— మంచి దూడలను కోరువారెల్లరును, పశువులను పొరలించు విధానమును కూడ తెలిసికొనుట చాల యవసరము. ప్రతి బక్కయెద్దును ఆవుతో కలియనీయరాదు. దాటు యెద్దుకు గల లక్షణములన్నియు దూడలకు వచ్చును గనుక, మంచి దూడలను కోరువారు, మంచిరకపు యెద్దుచేతనుగాని, ఆబోతుల చేతనుగాని పొరలించుచుండవలెను.

విత్తనపుటెద్దు లేక ఆబోతు:— ఆబోతులుగానుంచుటకు యేర్పాటైన యెద్దులకు రెండవ సంవత్సరము గడవకముందే విత్తులను గొట్టించ

వలెను. అట్లు జేసినచో వాటికి బాధ మిక్కిలిగా నుండదు. ఎడ్లకు చాల వయస్సు వచ్చు పర్యంతము విత్తులు కొట్టకుండ నుంచుట మిక్కిలి తప్పిదము. విత్తులు కొట్టించుటవలన, వాటివలన పనికిమాలిన దూడలు పుట్టకుండును. పనికి మాలిన యెడ్లవలన మంచిదూడలు పుట్టకుండుట వల్లనే మనపశువులు రాను రాను హీనస్థితికి వచ్చుచున్నవి. సరియైన యీడురాని పశువులను దాటించరాదు.

విత్తులు కొట్టు విధానము ఫలితములు:— మన దేశమందలి పశువులకు విత్తు (పిచ్చలు) కొట్టుటకు సాధారణముగా, సుత్తి, కఱ్ఱ చెక్క, రాతిగూటములలో నేదో నొకదాని నుపయోగింతురు. ఇట్లు చేయుటచే విత్తు సరిగా నలుగకపోవుటచే సంపూర్ణఫలితము గలుగదు. అట్టి యెద్దు దాటుటచే నొక్కొక్కపుడు ఆవులకు కూడ నుపద్రవము గలుగవచ్చును. గనుక యిట్టి పద్ధతిని విరమించి, విత్తులుండు కోశములను, చాకుతోడనో, నపుంసక యంత్రము తోడనో దెరచి - యందుండెడి విత్తులను గోసిగాని, పిండివేసిగాని విడచిపెట్టిన యెడల జాల లాభదాయకముగ నుండును. విత్తులను దీసినతరువాత నొక పాలు కార్బాలిక్ యాసిడును, ఇరవైపాళ్ల వేడినీటితో జేర్చి, దానితో కడుగుచుండిన యెడల త్వరలో పుండు మానిపోవును. టించ్చరుఫెర్రి పెర్క్లోరైడుతో పై ప్రకారమే చేసినను మానిపోవును.

విత్తులను కొట్టుటకు మారుగా చిన్నతనములోనే దూడల పిచ్చలకు ప్రతిదినమును మనము కూరలలో వాడుకొనెడి ఉప్పును రాయుచున్న యెడల, వాటిని తల్లులు నాకుచుండును. ఇట్లు చేయుటవలన కొంతకాలమున కట్టెదూడలు విత్తులు కొట్టనవుసరము లేకుండ నపుంసకము లైపోవునట్లు కొందరు పెద్దల వచనముకూడ గలదు.

ఆబోతులుగా నుండదగిన పశువులు:—దూడలయొక్క తల్లులు మంచి లక్షణములు గలవై, మంచి పాడి గలిగినవిగా నున్నచో వాటిదూడలుకూడ మంచిలక్షణములు గలవై బలిష్ఠములుగ నుండును.

అట్టి దూడ యాబోతుగ నచ్చువేయబడినచో సంపూర్ణ సద్గుణములు గలిగి దానికి పుట్టెడు దూడలకు కూడనట్టి మంచిలక్షణము లన్నియును గలిగితీరును. అచ్చువేయదలచుకొన్న దూడలు పెద్దవైన పిదప రెచ్చి తమ కొమ్ములతో నితరుల కెవ్వరికిని హాని కలుగకుండు నట్లు చేయుటకుగాను యట్టి దూడలకు గొమ్ములు వచ్చుట కారంభించునపుడు, కొమ్ములువచ్చు ప్రదేశమున చర్మముపై రోమములను దీసివేసి కొన్ని చుక్కలు యెమోనియా ద్రావకము వేసిన నీటితో కొమ్ములకు తగులకుండ చర్మమును కడిగివేసి, పిదప కాష్టిక్ పొటాష్ (Caustic potash) ముక్క నొకదానిని కారు (Forceps) తో పట్టుకొని దానికొనను నీటిలో ముంచి పదిసార్లు మెల్లగా కొమ్ముపైన పూయవలెను. దూడ రెచ్చినచో పూయుట మానవలెను. ఇట్లు చేయుటవలన బాధయుండదు. పుండుపడదు. కొమ్ము మాత్రము మాడిపోవును. పొటాషు ముక్కను, చేతితో పట్టుకొన్నచో చేయి కాలును గనుక కారుతోనే పట్టుకొనవలెను.

ఆబోతుల నెన్నడును మూడేండ్ల వయసులోపున ఆవులపై నెక్కనీయరాదు. అటుగాక వాటిని దాటనిచ్చినచో నవి చెడిపోవుటయేగాక దూడలుకూడ మంచివిగా పుట్టుట యరుదు. అందుచే వయసు వచ్చు పర్యంతము ఆబోతుల ముందుకు ఆవులను తోలరాదు.

సశేషము.

# స్వస్థవృత్తము — ఆహారము

శ్లో॥ అత్యాహారం భవేద్గ్లాని - అల్పాహారం బలక్షయం
తేనహారం సమంసౌఖ్యం - ఆయుర్వేదేన ముత్తమం.

అనెడి యారోగ్యసూత్రము ననుసరించ వలసియుండ మానవు డశ్రద్ధతో నాహార నియమములను పాటింపని కతమున వ్యాధిగ్రస్తు డగుచున్నాడనుట నిర్వివాదాంశము.

భోజన సమయమున ద్రవ పదార్థముల నెక్కువగ పుచ్చుకొనినచో జీర్ణరసములతో కలసి వాటి శక్తిని నశింపజేయును. ఎల్లపుడును భోజనము మితముగా నుండుట మంచిది.

రోగులకు రోగాతిశయమును బట్టి ఒక్కొక్క, రుచిమీదకు మనసు పోవుచుండును. కారము యెక్కువగా తినవలెనని గాని, వేడి పదార్థములు తినవలెనని కాని కోరిక పుట్టినచో అజీర్ణముగా నున్నదని గ్రహింపనగును. పుల్లటి వస్తువులపై కోరిక యున్నచో పైత్యము యధికముగా నున్నదనియు, చల్లని వస్తువులం దపేక్ష గలిగినచో శరీరమందుష్ణ మధికముగ నున్నదనియు గ్రహింపనగును. రోగులకు సాధారణముగా ద్రవరూపమగు యాహారమిచ్చుట కడు శ్రేయము.

పచనపదార్థముల యొక్క ఆవశ్యకత:— ఆదిని మానవుడు కూడ పండ్లు దుంపలు ఆకులు మొదలైనవి తన యాహారముగ జేసికొని జీవించెడివాడనియు, రాను రాను బుద్ధిబలము హెచ్చినకొలది నిప్పును వుపయోగించి వంటకలవాటు పడెననియు, శాస్త్రజ్ఞు లభిప్రాయమిచ్చి యున్నారు. సృష్టియందలి జీవకోటి కంతటికిని యాహారము తినుటకు పూర్వము నిప్పు నుపయోగించుట యనునది గ్రహించిన దొక్క మానవుడే యై యున్నాడు. కనుక మానవుడే వంట పదార్థములను సేవింప వలసినదని రుజువగుచున్నది. పచనము యొక్క ముఖ్యోద్దేశ్యము యాహారమును సులువుగా జీర్ణమగునటుల జేయుటయై యున్నది.

అమితాహారము, తొందర భోజనము:— త్వొందరగా భుజించుట, యధికముగా భుజించుట యనునవి రెండును జీర్ణమండలమును జెరచును. బాగుగా నమలి తినువారలకు కొలది యాహారముతో నాకలి తీరును. అటుగాక తొందరగా తినినచో హెచ్చు యాహారము భుజింపబడి, జీర్ణముగాక యనేక వ్యాధులు జనించుటకు కారణ మగును.

భోజనమయిన వెంటనే శరీరమునకుగాని, మెదడునకుగాని యలసట గలుగజేయుట, అలసట జెందిన వెంటనే భుజించుట యనునవి మిక్కిలి చెడు యలవాట్లు - ఇందువలన వెంటనే కొంత విశ్రాంతియు, అలసట చెందిన తర్వాత కొంతవిశ్రాంతియు మిక్కిలి యవసరము. భుజించిన వెంటనే నిద్రించుట, సంభోగించుట, స్నానము చేయుటయనునవన్నియు అజీర్ణహేతువులే యగును.

సశేషము.

---

# శారీరశాస్త్రము. (Anatomy & Physiology)

## కాళ్లు చేతులు వీటియందలి యెముకలు.

భుజమునందలి యెముకలు:—(The Shoulder Bones) భుజమునందు రెండెముకలుగలవు. మెడ కొంకి లేక జత్రువు (Clavicle) యనునదియు, అంస ఫలకము Scapula) ఇట్టివి రెండు జతలు మానవ శరీరమందుగలవు. మెడ కొంకి యొక్క నొక చివరభాగము రొమ్మెముకతోడను, రెండవ చివర అంస ఫలకముతోడను యతుకబడి యున్నది. ఇట్టి కొంకులు భుజములను విప్పుట కుపయోగించును. అంసఫలకము త్రిభుజాకృతిగానుండి, చాలభాగము పల్చగను, బల్ల పరపుగను యుండును. మెడ కొంకితో నతకబడిన కోణము వద్ద మాత్రము దళసరిగా నుండును. అంసఫలకము పక్క జెముకలను కప్పి విసనకర్రను పోలి యుండును.

చేతులందలి యెముకలు:—(Bones of the hands) భుజము నుండి మోచేతివరకును వ్యాపించి, దృఢముగానుండెడి యెముకకుదండ చేతి యెముక లేక భుజాస్థి (The arm bone or humerus) యని పేరు. ముంజేతియందు రెండెముకలు గలవు. బొటన వ్రేలితట్టున యుండెడి యెముకకు మణిబంధాధారాస్థి లేక ప్రకోష్ఠిక (Radious) అనిన్ని, చిటికెన వ్రేలుతట్టున యుండెడు యెముకకు కూర్పరాస్థి లేక మూర యెముక (Ulna) అనిన్ని పేర్లుగలవు. మణికట్టునందును, అరచేతి యందును ఎట్లు త్రిప్పినయట్లు తిరుగుటకు వీలగునట్లు సన్నపాటి యెముకలు అమర్పబడి యున్నవి.

మణికట్టునందు యెనిమిది యెముకలు కలవు. వీటికి మణికత ములు (Carpal bones) యన్నూ, అరచేతియందు అయిదు యెముకలు గలవు. వీటిని కరాంగుళ్యాధారాస్థులు (Metecarpal bones) అంటురు. వ్రేళ్ళయందు, బొటన వ్రేలియందు మాత్రము రెండును, మిగిలిన నాలుగు వ్రేళ్ళయందును ఒక్కొక్క-దానియందు మూడేసివంతున పండ్రెండును వెరశి వ్రేళ్ళయందలి యెముకలు పదు నాల్గును గలవు. వీటిని కరాంగుళ్యాస్థులు (Phalanges) యందురు.

సశేషము.

---

# మీమాంస

## మూలికాప్రస్తావన - (బలా చతుష్టయము.)

బలయను మూలికకె చిట్టాముట్టియను నామాంతరముగలదని వాడుక. బలయందు నాలుగు జాతులు గలవని కొందరును అయిదు లేక ఆరుజాతులని మరి కొందరును వచించుటయు గలదు. ఆరు జాతులేవనగా:— (1) బల, (దీనినే సాధారణ బలయనుటయు గలదు.) (2) అతిబల, (3) మహాబల, (4) నాగబల, (5) రాజబల, (6) భద్రబల యనునవి.

ప్రతి మూలికయు సాధారణముగ నాలుగుజాతు లుండుట సహజము గనుక పూర్వసాంప్రదాయాను సారము వరుసగా మొదటి నాలుగు బలలే ప్రాధాన్యములని గ్రహింపనగును. ఈ నాలుగు బలలయొక్క నిర్ణయము నేటివరకు యే గ్రంధకర్తలుగాని, వైద్య విద్వాంసులుగాని జేసియుండలేదు. అట్టియెడల గ్రంధాధారములతో నుండెడి వైద్య సోదరులు మూలికల నమ్మెడి దుకాణదారులపై నాధారపడి, నట్టివారేవిధమగు మూలికలకైనను నొకేదినుసుగల బుట్టను త్రిప్పి యిచ్చుచుండినను, పాపము మూలికలను గుర్తించలేని వైద్యసోదరులేమి చేయగలరు ? మహా ప్రసాదముగ స్వీకరింపక తప్పదు కదా ! అదియును గాక నిఘంటులను రచించిన గ్రంధకర్తలే బల విషయము నిరూపణ చేయక వారికి తోచినరీతిని వ్రాసి వైద్యసోదరుల కందజేయుచున్న తగుణములో నట్టివారి యాజ్ఞను శిరసా వహించి నడచుకొనక తప్పదుగదా ? ఇట్టి పరిస్థితులలో ఆయుర్వేద వైద్యులను "క్వాక్సు" (Quacks అనగా శాస్త్ర పరిచయములేని వైద్యులు) యని పిలవకేమి చేయుదురు ? ఇట్టి "క్వాక్సు" పట్టభద్రులై అన్యవిధాన మవలంభించిన డాక్టరు సోదరులందుకూడ యున్నప్పటికిని, రాజపోషణకరమైన యితర వైద్యవిధాన మవలంభించిన వారికట్టి నామము పరిపాటియైనది. అందునను ఆయుర్వేదీయుల పట్ల గట్టిగ అన్వయింపబడుటకు కారణము లేకపోలేదు. ఏ శాఖకు చెందినవారైనను సరే నిప్పటి వైద్యులలో నూటి కెంతమంది శాస్త్ర పరిచయము గల వైద్యులో నిర్ణయించి చెప్పుట కంటె ప్రతివైద్యసోదరుడును, తనకు తానేయెట్టి వైద్యులలో జమ కట్ట బడగలడో ఆలోచించుకొని తన లోటులను పూర్తి జేసికొనుటకు ప్రయత్నించుట సమంజసము. ఇప్పటికైన వైద్యసోదరు లెల్లరును తగిన కృషి చేయుచు, వారికి దెలిసిన మహద్విషయములను, తోటివైద్యసోదరులకు తెలుపుటకు ప్రతి బంధకము లేనిచో పత్రికల మూలమున వెల్లడించుచు, దేశీయ వైద్యమగు నాయుర్వేదమును పూర్వపు టౌన్నత్యమునకు దెచ్చుటకు తోడ్పడెదరుగాక. ఇక బలాచతుష్టయ మేదియోనిర్ణ

యుంతము. ఇట్టి నిర్ణయ మేర్పడుటకు ముందు, బలయొక్క పర్యాయ పదములు, నైసర్గిక స్వరూపములను గమనింతము.

సశేషము.

---

# శిశు వ్యాధులు, చికిత్సలు.

కుకూణక బాల రోగనిదానము:—(ఇచటనుండి శ్లోకములు వ్రాయబడక భావములు మాత్రమే వ్రాయబడును.)

శిశువునకు పాలదోషమువలన, కుకూణకమనెడి రోగము జనించును. అందుచే కండ్లు దురద గలిగి పలుమారు నీరు స్రవించుటయేగాక, కండ్లు, శిరస్సు ముక్కులను సహా శిశువు నలుపుకొనుచుండును. (రుద్దుకొనుట.) మరియు కండ్లు తెరచుటకు నశక్తమై సూర్యకాంతిని చూడజాలకుండును.

పైవ్యాధికి చికిత్స:—కరక, తాడి, పుసిరెక, లొద్దుగచెక్క, తెల్లగలిజేరు, అల్లము, నేలములక, పెద్దములక యనువాటిని నూరి ఉడికించి, సుఖోష్ణముగ శరీరమునకు లేపన మొనరించినచో శ్లేష్మము మారించి కుకూణక రోగమంతరించును.

పారిగర్భిక నిదానము:—గర్భవతియైన తల్లి యొక్కపాలు శిశువు త్రాగినచో, దగ్గు, అగ్నిమాంధ్యము, వమనము, తంద్ర, కాస, అరుచి, భ్రమ యనునవి గలుగుటయేగాక, శిశువు యొక్క కడుపుసహా వృద్ధియగును. దీనికే పరిభవమను మరియొక పేరు కూడ గలదు. ఈ వ్యాధికి దీప నౌషధములను వాడవలెను. (వేడిజేయు మందులనే దీప నౌషధ మనియెదరు.)

సశేషము.

# స్త్రీవ్యాధులు - చికిత్సలు.

తెల్లగుడ్డను కాల్చిచేసిన మసి, పంచదార సమానభాగములుగా కలిపినది పూటకు బేడెత్తువంతున సేవించి, పులగమును నేతిని జేర్చితినినచో తెల్లకుసుమవ్యాధితగ్గును. ఉప్పుకారములుమానవలెను.

నల్లతుమ్మజిగురు, తెల్లజీలకఱ్ఱ, పొగడచెక్క చూర్ణము, పంచదార యనునవి యొక్కొక్కటి తులమువంతున సేకరించి, ఆవునేతితో లేహ్యపాకముగావండి పూటకు అరతులంవంతున సేవించి పై విధముగా పథ్యమున్నయెడల తెల్లకుసుమ తగ్గును.

ఏలకులు, నాగకేశరములు, జాజికాయ, జీలకఱ్ఱ, కురువేరు, వట్టివేళ్ళు, శ్రీచందనము సమభాగములుగ చూర్ణించి పూటకు బేడెత్తువంతున చక్కెరతో దీసికొన్నచో తెల్లకుసుమ తగ్గును.

తెల్లజీలకఱ్ఱ, గవ్వపలుకు సాంబ్రాణి, మాచికాయ యనునవి సమాంశలుగా చేర్చి పూటకు బేడెత్తు వంతున మంచినీటితో నిచ్చినచో తెల్లకుసుమ తగ్గును.

ఏనుగు పల్లేరు యాకులు 7, మిరియాలు 7, వెల్లుల్లిగర్భాలు 7 న్నూ నూరి మాత్రకట్టి పరగడుపున పక్షము దినములు దీసికొని పులగమును నేతితో తిన్నచో తెల్లకుసుమ తగ్గును.

పిడక కాల్చిన బూడిద (వెలిబూడిద లేక కచ్చిక)ను వస్త్రఘూలిత మొనర్చి పూటకు బేడెత్తువంతున పాలతో నిచ్చినచో తెల్లకుసుమ తగ్గిపోవును.

తెల్లజీలకఱ్ఱ, కాల్చిన వేపాకు యొక్క మసి, చక్కెర యనునవి మూడును సమాన భాగములు జేర్చి మంచినీటితో నిచ్చినచో తెల్లకుసుమ తగ్గును.

చిర్రివేళ్ళు, అతిమధురము, తిప్పసత్తు, శ్రీగంధము, జాజికాయ, తామరపువ్వునందలి కేసరములు, చల్లగడ్డ (సఫేదమిసిరి) యనునవి సమాంశలుగాజేర్చి, చూర్ణించి సమాంశలు పంచదారను కలిపి, పూటకు బేడెత్తువంతున సేవించినచో తెల్లకుసుమ తగ్గును.

---

సశేషము.

# దీర్ఘవ్యాధులు - క్షయ లేక రాజయక్ష్మ.

క్షయవ్యాధి నివారణకు ముఖ్యముగా కావలసినది తరుణములో రోగమును గుర్తించుట, వెంటనే చికిత్సించుట యనునవి. వ్యాధియొక్క ప్రారంభావస్థనందే గుర్తింప గలిగినచో, అచిరకాలములోనే, తక్కువ వ్రయములో రోగమును మాపుజేయ వచ్చును. ఆలస్యమైనకొలది నన్నియు వ్యతిరేకములే యగును.

రక్తవమనము లితర కారణములచే గూడగలుగును. అయినను క్షయగా ననుమానించి, చికిత్సజేయుట శ్రేయస్కరము. క్షయసంబంధమగు రక్తవమనము మిక్కిలి యెరుపురంగుగలిగి నురుగుతో గలసి యుండును.

రక్తజీరతో కూడిన కళ్లెతో వచ్చెడి దగ్గును, తప్పక ఊపిరితిత్తుల (Pulmonary Tuberculos) సంబంధమగు క్షయగా గుర్తింపవలెను. క్షయలో నుండెడి రక్తవాంతి వెంటనే తగ్గక ఒకటి రెండు దినములు కూడ వరుసగా నుండుటకూడ గలదు.

పుపుసవేష్టపువాపు (ఊపిరితిత్తులపై నుండెడి పొరయొక్క వాపు) (Pleurisy) :—క్షయతో కూడిన ఊపిరితిత్తులు ఒకానొకపుడు, పుపుసవేష్టపువాపు (Pleurisy) గను; పుపుసవేష్టపువాపు క్షయగను మారవచ్చును. ఇట్టిసమయములందా యాసంబంధమగు జీవులు నిశ్చలముగ నుండును. అనగా క్షయసంబంధమగు వ్యాధినుండి పుపుసవేష్టపువాపు వ్యాధికి మారునపుడు క్షయజీవి నిశ్చలముగ నుండుట. ఇట్లే మిగిలినది కూడ యుండునని గ్రహించదగును.

నూటికి ముప్పదిమంది క్షయవ్యాధిగ్రస్తులు పుపుసవేష్టపు వ్యాధి గ్రస్తులగుచున్నట్లు చాలమంది వైద్యపుంగవులు కనిపెట్టి యుండిరి. పుపుసవేష్టపువ్యాధి గ్రస్తులలో నూటికి యాభైమంది క్షయ వ్యాధి గ్రస్తులగుటయు గలదు. కనుక మనజాగ్రత్త నిమిత్తము

పుప్పుసవేష్టపువ్యాధిని తప్పక క్షయసంబంధము గలిగి యుండునట్లు నెంచి తగినంత జాగ్రత వహించవలెననుట మరువరానిది.

క్షయవ్యాధి యంకురించిన పిదప చాలకాలము వరకుక్షయ లక్షణము లగుపించకుండుటకూడ గలదు. ఇట్టి సమయములందు సాధారణముగా రోగి చురుకు దనము తగ్గి బడలిక కలిగియుండును. ఆహారమునందిచ్ఛ లేక యుండును. ఆయాసము గలిగి యుండును. ఈ లక్షణముల నన్నిటికిని క్షయ సూక్ష్మజీవులచే సృష్టింపబడెడి, విషయుక్తమగు చీమునంటి పదార్థమే కారణము. ఈ లక్షణములతో కూడిగాని, కొంతకాలమైన తర్వాతగాని, సాయంకాలము రోగికి స్వల్పజ్వరము, (దీనినే పుకుకని రోగులందురు) నాడియందు చురుకు దనమును గలుగును. ఇట్టి దశలో స్వల్పముగ దగ్గుయుండవచ్చును. లేదా లేకుండ నగును. లేక స్వల్పముగ దగ్గు ఉదయమునగాని, రాత్రి భాగమునగాని యుండవచ్చును. దగ్గునపుడు కొందరికి కళ్లె పడుటయు, మరికొందరికి కళ్లెలేకుండుటయు కూడగలదు. అనగా పొడిదగ్గుమాత్రమే యుండును. కొందరియందు అగ్నిమాంద్య ముండును. నరముల నిస్సత్తువ, చర్మము ఆరిపోయి బిరుసెక్కుట, మాటబొంగురువారుట కూడ గలుగును. ఏకారణముల చేతనైనను పై లక్షణములు రోగియందు గన్పించిన వెంటనే అశ్రద్ధ నెంత మాత్రమును చేయక జాగ్రత వహించవలెను. ఒకే వ్యక్తియందు అన్నిలక్షణములును యగుపించవు.

దగ్గు:—(Cough) క్షయకు గుర్తు దగ్గుయనునది ముఖ్యమని తలంచబడును. అట్లని ప్రతిసామాన్యమైన దగ్గును క్షయగా నను మానించి మనోవ్యాధిని తెచ్చిపెట్టుకొనరాదు. క్షయవ్యాధికి ప్రారంభ దశనందు వుదయమువూట దగ్గుయధికమై, కళ్లె లేక వాంతి గలిగి యుండును.

ఒగర్పు:—(Dyspnoea) రోగిని యిది మిక్కిలిగా వ్యాధి గ్రస్తునిగ జేసి, వూపిరి అందకుండ జేయుచు, ఇతరలక్షణములలో క్షయ రోగము ననుకరించు చుండును.

సశేషము.

# ప్రథమ చికిత్స. (First Aid)



ఎముక విరుగుటచే గలిగిన గాయములకు చికిత్సచేయుటకు ముందు గమనింపవలసిన విషయములు:—ఎముక విరిగినదీ, లేనిదీ సందేహముగానున్నను విరిగినట్లే యెంచి కట్టుకట్టవలెను. కట్టు కట్టునపుడు బద్దలు ముందుపెట్టి దానిపైన కట్టు గుడ్డలతో కట్టవలెనేగాని విరిగిన అవయవముపైన బద్దలు లేకుండా కట్టుకట్టరాదు. గాయము తగిలిన మనిషి నొక చోటినుండి కదల్చుటకు ముందు యెముక విరిగిన అవయవమునకు కట్టు కట్టిన పిదపనే యట్టిపనిచేయవలెను. కాలి యందలి యెముక విరిగిననో నట్టివ్యక్తి యొక్క పాదమును కాలికి సమకోణముగా నుంచవలెను.

మణికట్టు, చేయి, వ్రేలు, చీలమండ, పాదములందలి యెముకలు విరిగినయెడల, యెల్లపుడును కట్టు బద్దలకు మెత్తల నేర్పాటు చేసిన పిదపనే కట్లు కట్టవలెను. మెత్తలనగా దూదిగాని మెత్తని గుడ్డల మడతగాని కట్టు బద్దలకు జేర్చి కట్టుటయే.

దండచేయి, ముంజేతులందలియెముకలు విరిగినచో, ముంజేతిని మోచేతికంటె పైకి నెత్తియుండునట్లు చేయవలెను. వ్రేళ్ళను పైకి చాచి యుండునట్లు చూడవలెను.

కట్టుగట్టునపుడు గాయముల కిరుప్రక్కలనుండు కీళ్ళు కదలకుండునట్లు జాగ్రత పడవలెను. గాయముపైన బద్దను నేరుగా పెట్టి కట్టుకట్టరాదు.

ఎముకలు గూళ్లనుండి తొలగిపోయిన గుర్తులు:— కీలువద్ద యెముకలు ఒకదానితో నొకటి కలపబడినట్లు అమర్చబడి యుండు కీళ్ళు గూటినుండి బైటికి తొలగిపోవుటయే, యెముక తొలగిపోవుట (Dislocation) యందురు. సామాన్యముగా భుజము, మోచేయి

వ్రేళ్లు, క్రింది దవడలయొక్క కీళ్ళయందలి యెముకలు తమ గూళ్ళ నుండి తొలగిపోవుచుండును.

తొలగినకీళ్ల వద్ద అపరిమితమగు బాధ గలుగును. అట్టి అవయము కదల్చుటకు వీలుండదు. తొలగిన కీళ్ల వద్ద వాపుండును. నొప్పి గలిగియుండును. అంగవికారముండును. తొలగిపోయిన యెముక పొడవుగాగాని, పొట్టిగాగాని కన్పించును. ఎముకలు ఒంటికీలు వద్దనే తొలగును గాని రెండుకీళ్ళవద్ద తొలగనేరవు. ఎముకలు విరుగవు. కరకరశబ్దముండదు. ఎముక తొలగిపోయినకీలు కదలక స్థిరముగా నుండును. తొలగిపోయిన యెముకను తాకి తెలిసికొనుటకు వీలుండును. ఎముక విరుగుటకును, కీలు తప్పుటకును, తేడా యేమనగా, తొలగి పోయిన అవయవమును, కదల్చుటకు సాధ్యపడకుండుటయేనని గ్రహించవలెను.

ఎముకలు తొలగిపోయినపుడు చేయవలసినచికిత్స:—తొలగి పోయి యుండెడి అవయవమును సాధ్యమైనంత వరకు రోగికి సౌఖ్యమగు స్థితిలో నుంచవలెను. దీనికి చికిత్స చేయుటలోని యుద్దేశ్యమేమనగా, జారిపోయిన యెముకను, దాని యథాస్థానములోనికి పంపుటయే. ఇట్లు చేయుటకు బాగుగా తర్ఫీదైన వైద్యుని సహాయమవుసరము. గనుక యెముక తొలగినదని తెలిసిన వెంటనే అశ్రద్ధ యెంత మాత్రమును జేయక నేర్పరియైన వైద్యునియొద్దకు దీసికొని పోవలెను. రోగిని యెంత త్వరగా చేర్చిన, యంత తొందరగా యెముకను గూటిలో చేర్చుటకు వీలు పడును. ఆలశ్యమైనచో శస్త్రచికిత్సకూడ చేయవలసివచ్చును. తనకు చేతకాని యప్పుడు జారిపోయిన యెముకను యథాస్థానమందుటకు యెంతమాత్రమును ప్రయత్నింపరాదు. గుడ్డను చల్లని నీటిలోగాని మంచుగడ్డవేసిన నీటిలోగాని తడిపి ఒసిలిపోయిన కీలుమీద వుంచుటమంచిది.

సశేషము,

# అగద తంత్రము

ఇంగిలీకం:—నేతితో మిరియాల పొడినిచేర్చి యేడు దినములు సేవించినచో దీని వికారమణగును.

కర్పూర శిలాజితు:—పై ప్రకారమే చేయవలెను.

జిల్లేడు పాలు:—ఆవు వెన్నలో పంచదారనుచేర్చి సేవించినను, నీలియాకు రసమును త్రాగినను, జిల్లేడు పాల యొక్క దుర్గుణములు నశించును. పటికి బెల్లమును నీటితో జేర్చి యిచ్చిన తగ్గును.

జిల్లేడు మొగ్గలు:—నిర్వి షమును సేవించినచో దీని విషవికారమణగును.

జిల్లేడుపాలు, నూనె:—దీని విషము. గేదె వెన్నను దినిపించినచో మాయమగును.

మాత్యములు:—ఆవుపాలు, తేనె, నేయిని సమాన భాగములుగ జేర్చి, పటికిబెల్లపు పొడిని జేర్చి యిచ్చినచో, దీని యొక్క దుర్గుణములు తగ్గును.

పగడములు:—పై ప్రకారము చేసినను, వెదురు వేళ్ల రసము నిచ్చినను దీనిచెడ్డ పోవును.

వజ్రములు:—పై ప్రకారమే చేయవలెను.

పెద్దముత్యాలు:—బియ్యపు పిండిని తినిపించినచో పెద్ద ముత్యాల యొక్క అవగుణములు తగ్గును.

మంచి ముత్యాలు:—పులి గోరుచూర్ణము నిచ్చినచో దీని దుర్గుణమణగును.

పుష్యరాగము:—భూచక్ర రసము నిచ్చినచో దీని వికారమణగును.

వైఢూర్యము:—దీనివలన కలిగిన అవగుణములు, ఉసిరి కాయల రసము నిచ్చినచో తగ్గును.

గోమేధికము:—గోమయమును, గోమూత్రమును సేవించిన యెడల దీనియొక్క విషప్రభావము నశించును.

మాణిక్యము:—దీని వికారమునకు జ్యోతిష్మతి (పెద్దవెక్కుడు లేక మాల్కంకిణి) యొక్క పచ్చిరసము నిచ్చినచో తగ్గిపోవును.

నీలము:—ఈతవేళ్ళ రసమునిచ్చినచో దీని చెడుగుణములు నశించును.

కృష్ణాభ్రకము:—నల్లతులశాకు రసము నిచ్చినచో దీనివలన కలిగిన దుర్గుణము లంతరించును.

శ్వేతాభ్రకము:—తెల్లమోదుగ రసమునిచ్చినచో దీని చెడుగుణము లడగును.

రసకర్పూరము:—రాతి పంచును వేడినీటితో నరగదీసి యిచ్చినచో, దీని వికారము శాంతించును.

సర్వీరము:—కొబ్బరినీటిని పొంగించి తగుమాత్రము, నిమ్మకాయరసమును జేర్చి యిచ్చినను, గాడిదమూత్రమును త్రాగించినను, దీని వికారము పోవును.

సర్వపాషాణములు:—పమిడి పత్రాకు, దీనిపూలు, కాయలు కలగల్పి నూరిన రసమునుగాని; నీలి వేళ్ళు, మిరియాలుచేర్చి నీటితో కషాయము కాచిగాని, కాకరాకురసము, నేరేడుపండ్లు, మిరియాలు, వెలగపండు, తమలపాకు తీగెయనువాటి కషాయమును గాని యిచ్చినచో సర్వపాషాణముల యొక్క చెడుగుణము లను నశించును.

జెముడుపాలు:—తులసి విత్తుల చూర్ణమునుగాని, తంగేడాకును నూరిగాని దీనికొన్నచో, దీని విష వికారము శాంతించును. కలకండ పొడిని, నీటితోచేర్చి త్రాగించి, చింతాకు చల్లని నీటితోనూరి శరీరమునకు పూసినచో వికారము నశించును.

బొంతజెమ్ముడు:—పై మాదిరిగనే చేయవలెను. లేదా పెసర కట్టుగాని, బియ్యపు జావనుగాని యిచ్చినచో దీని విషవికార మణగును.

సన్న జెముడు:—(కాడజెముడు.) గేదెవెన్ననుగాని, తంగేడు చిగుళ్ళరసమునుగాని, నీరుల్లిపాయల రసమునుగాని యిచ్చినచో దీనిచెడుగుణము లంతరించును.

వసనాభి:—చిర్రివేళ్ల రసముగాని, పచ్చినేరేడు చిగుళ్లనుగాని, నరమూత్రమునుగాని యిచ్చినయెడల దీనిచెడుగుణము లంతరించును.

వసనాభి, నూనె కలసినది:—చిర్రికూర, పెన్నేరును చేర్చి యిచ్చినచో (పెన్నేరు రసమునిచ్చినను) వీటిచెడుగుణము లడగును.

మంచినూనె గన్నేరువేళ్లు:—కరక్కాయ పొడిని నీళ్లతో గలిపి త్రాగినచో, వీటిని కల్పి సేవించిన విషము నశించును.

చెముడుపాలు నూనె:—అప్పుడు వెన్నకాచిన నేతిని త్రాగినచో వీటిచెడ్డగుణము లంతరించును.

నూనె, గురిగింజలు:—చిట్టివేళ్ళ రసమును చారెడు త్రాగించినచో దీని విషగుణమణగును.

పోస్తుపట్టు, నూనె:—శొంఠిపొడిని వేడినీటితో గలిపి త్రాగించినచో, దీని విషమడగును.

నూనె, జొన్నన్నము:—నూనెయు, జొన్నన్నమును కలిపి నూరి త్రాగిన విషమునకు, మొగలిచండ్లరసము నిచ్చినచో తప్పక తగ్గిపోవును.

సశేషము.

---

# వివిధ విషయములు.

## సమస్త బాధలకు నొకమంచి యౌషధయోగము.

మెంథాల్ — ఒకభాగము, (పెప్పర్మెంటుసత్తు.)
థైమాల్ — ఒకభాగము, (వాముపువ్వు.)
కాంఫర్ — ఒకభాగము, (ముద్దహారతి కర్పూరం.)

పైవాటిన్నిటిని గాజుబిరడాగల సీసాలోవేసి కదిపినయెడల ద్రవముగా నగును. దీనిని ఒకటి రెండుచుక్కలను తమలపాకుమీద గాని, నాలుకమీదగాని వేసుకొని మ్రింగినచో, తలనొప్పి, కండ్లు బైర్లుగమ్ముట, సొమ్మసిలుట, గుండెదడ మొదలైనవి తగ్గును. నాలు గైదుచుక్కలను కొంచెము నీటిలో వేసి త్రాగినచో కడుపుబ్బరము, కడుపులోపోట్లు, పైత్యశూల, వికారము మొదలైనవి తగ్గును. ఏ విధ మగు బాధలకైనను సరే పైకి రాసినను, చెవిపోటు, పండ్లపోటు తల నొప్పులకును అమోఘముగా పనిచేయును. దీనిని హిందూదేశము నందలి మందుల కంపెనీలు వివిధ నామములతో ప్రచారము చేయు చున్నారు.

(A VERY GOOD PRESCRIPTION FOR VARIOUS PAINS.)

| | |
|---|---|
| Menthol | 1 Part. |
| Thymol | 1 Part. |
| Camphor | 1 Part. |

This should be mixed in a stopperel bottle a drop or two on tongue or betal leaf (pan) is a good stimulant in head ache, giddiness, fainting, Palpitation etc. Four or five drops in water is a useful Carminative in flatulence Colic, gastric pain, nausea etc. Externally it is applied over seat of Pain in Various conditions : Ear ache, Tooth ache, Head ache, etc. This is a very good combination and is much advertised by some Indian firms by different

names and is offered to the public in dilute form. But the above prepartion is the best suited and is found more efficacious.)

AN EXCELLENT OINTMENT FOR HEMORRHOIDS.

మూలశంఖవ్యాధికి ప్రశస్తమైన ఔషధయోగము.

Powdered opium
నల్లమందును పొడిగా జేసినది. } 30 గ్రయినులు.

Tanin (టానిన్) 1 డ్రాం.

Carbolic acid 15 m.s. (కార్బాలిక్ యాసిడ్ 15 చుక్కలు)

Oil lobelia 10 m.s. (ఆయిలు లోబీలియా 10 చుక్కలు)

Sol. Sub acetate lead 20 m.s. (సబ్ యాసిటేట్ లెడ్ సొల్యూషన్ 20 చుక్కలు; Simple ointment 1 oz. (సింపిల్ ఆయింటుమెంటు 1 ఔన్సు.)

Apply locally morning & night.

పైవాటిని కలిపి పైకి పూయవలెను.

---

# ఆంగ్లేయ చికిత్సా రత్నములు.

రేచీకటి, పగటిచీకటి (Blindness):—ప్రతి రెండుగంటలకు, (అనగా చెవులలో ధ్వనులు వచ్చు పర్యంతము.) (i. e. till ears ring) ఒకటి మొదలు రెండు గ్రైనుల క్వయినా నిచ్చినచో రేచీకటి, పగటిచీకటి తగ్గునని ఒక సుప్రసిద్ధ ఆంగ్ల వైద్య శిఖామణి తెలుపుచున్నారు.

కురుపులు, రాచకురుపులు (Boils & Carbuncles):— ఆరోమేటిక్ సల్ఫ్యూరిక్ యాసిడ్, (Aromatic Sulfuric Acid), అనే మందును, భోజనానంతరము ఒకగంటకు 20 చుక్కల మోతాదు

వంతున రోజుకు రెండుపర్యాయములు వాడించుచూ, అమ్మోనియం క్లోరైడు (Ammonium chloride) ను, పొటాస్ నైట్రస్ (Potas nitras) ను, సమానభాగములుగా కలిపి, దానికి మూడురెట్లు నీటిని జేర్చి, దానితో కురుపులను, రాచకురుపులను, కడిగినచో యితర విధానములకంటె త్వరగా మానును.

బోరోగ్లిసరైడ్:—(Boroglyceride.):— 62 భాగములు బోరిక్‌యాసిడ్‌ను (Acid Boric.) 92 పాళ్ళు గ్లిసరైనుతో జేర్చి కాచినచో, యీమందు తయారగును. దీనిని నీటితో చేర్చి పుండ్లను, వ్రణములను కడుగు చుండినయెడల, వాటిని కుళ్ళకుండా నాపు చేయును.

శిశువుల శ్లేష్మవాతము, రొమ్ముపడిసము (Bronchitis in infants.):—శ్లేష్మజాతిబిడ్డలను ఒకేవైపున చాలాసేపు పరుండ నీయరాదు. ముఖ్యంగా వెల్లగిల పరుండ నీయరాదు.

కాల్పులు:—(Burns) పిక్రిక్ యాసిడ్ 75 గ్రెయిలు, (Acid picric.) ఆల్కహాలు 2 ఔన్సులు (Alcohol.) నీరు ఒక క్వార్టరు చేర్చిన దానిని కాలిన పుండ్లకు పూసినచో త్వరగా మానును.

---

# ఆయుర్వేద చికిత్సారత్నములు.

కాల్పులు, పుండ్లు:—ఆముదములో కోడిగ్రుడ్డులోని తెల్లని సొనను జేర్చి, పుండ్లపైని పూసి కట్టు కట్టకుండా వదలినచో యితర కట్లు, పట్లుకంటె అమోఘముగా పనిచేయును.

గ్రహణికి, ప్రాక్పశ్చిమ సమ్మేళన చికిత్స:—శుద్ధగంధకము (Sublimed Sulphur.) 20 గ్రెయినులతో 5 గ్రెయినుల డోవర్సు పౌడరును కలిపి ప్రతి నాలుగు గంటలకొక మోతాదు వంతున వాడించినచో గ్రహణి తగ్గును.

---

సశేషము.

# వైద్య పుంగవుల వ్యాసములు.

ఏలూరు వాస్తవ్యులును సుప్రసిద్ధ ఆయుర్వేద కళాపరిశోధకులును, వైద్యావధానియునగు శ్రీ కవిరాజ కందుకూరి వేంకట సుబ్బారావుగారిచే రచింపబడిన ఆరోగ్యగీతావళినందలి ఆరోగ్య ప్రబోధ గీతమును గ్రంథకర్త యనుమతిని యీదిగువను చేర్చబడమైనది.

## ఆరోగ్య ప్రబోధ గీతము.

(ఎండలో వానలో.........కూలోడా—వలె)

1. ఏలాటి పనులున్న ఎన్ని తొందరలున్న
మీ దేహపాలనము మీది యేయని యెంచి
ఆరోగ్య మార్గంబు జనులారా !
అరసి వర్తింపుడీ జనులారా !

2. ఆ దేహమే లేక యాటలాడెడి దేమి
సర్వ కార్యములందు సాహాయ్య మా దేహ
మదినిల్పు కార్యమే జనులారా !
అరసి కావింపుడీ జనులారా !

3. గోచిపాతలతోడ గూర్చున్న మానులే
యోగమని దేహముల బాగుసేయుచు నుండ
సర్వంబు గోరేటి జనులారా !
సౌఖ్య మార్గము గనరె జనులారా !

4. దేవుడే జీవుడో దేహమే యాలయము
దేహమ్ము నిలుపగా దివ్యమౌ బలమొకడె
ఆధారమై యుండు జనులారా !
అదినిల్పు కొనుడయ్య జనులారా !

5. అరయ నిద్దుర యొండు ఆహారఫల మొండు
బ్రహ్మచర్యంబొండు వ్యాయామ కళయొండు
స్తంభంబులై యుండు జనులారా!
సౌఖ్య సౌధము నిల్పు జనులారా!

6. కప్పి పెట్టినయినుమె త్రుప్పు దుల్లుచునుండు
పెట్టి దాచిన గుడ్డ పిగిలి తీరునుగదా!
కష్ట పెట్టని తనువు జనులారా!
ఇష్టమౌ బలమిడునె జనులారా!

7. జాతిలోపలియగ్గి రాపాడినఁనె పుట్టు
నూతిలోపలి నీరు ఏతమె త్రిననూరు
వ్యాయామ మొనరింపజనులారా!
బలము మనలో నుబుకు జనులారా!

8. బలము బలమనుకొనుచు పలవరించుటతోడ
బలము మలమూత్రముల చలనమందుండునని
తెలిసివర్తింపుడీ జనులారా!
నిలిపి మాటాడకుడు జనులారా!

9. తల్లక్రిందులఁజెట్టు తనువు నిర్మాణంబు
మొదలు చేవలుదేరి మోదమ్ము గూర్పగా
తైలమర్దన మొకటె జనులారా!
దగిన దోహదమౌను జనులారా!

10 ప్రొద్దుపొడుపున లేచి ప్రొద్దుతో దిరుగాడి
ప్రొద్దుగ్రుంకిన యంత నిద్దురంగొనవలెను
పెద్ద జాగరణంబు జనులారా!
పెద్దనిద్దుర దెచ్చు జనులారా!

11. నడిరేత్రి పై ప్రొద్దు నాట్యమాడ్డే వేళ
కడుపారబోనంబు గుడిసియుండినవేళ

చదువుసాములు తగవు జనులారా !
శ్రమదీర్చుకోదగును జనులారా !

12. దైవశాసనమంచు దలపోసి పెండ్లాడి
ప్రజల సృష్టింపగా బాల్పడ్డతేజమే
ఆహారసారమా జనులారా !
అది దాచుకొను డయ్యా జనులారా !

13. మీ బిడ్డ మిముబోలి మేటియై మించగా
మీపాలె త్రావించి మీవానిగా జేసి
దేహసౌఖ్యం బిడుడు జనులారా !
దేశభాగ్యము పండు జనులారా !

14. ధనబలము బలమౌనె ? తుయినాతి బలమౌనె ?
ఆత్మబలమే బలము అంగబలమే బలము
అదికోరి యిదికోరి జనులారా !
ఆవుపాలే కొనుడు జనులారా !

15. ధనముండెనని పేదతనముండెనని యెంచి
తెగదిన్నరోగమే తినకున్నరోగమే
కడుపులోపలి యగ్గి జనులారా !
కడతేర్చు జాగ్రత్త జనులారా !

16. సాత్వికాహారంబు సంఘసేవయుబూని
తలయూడినను పట్టుదల మానరాదంచు
చిట్టిచీమయు జెప్పు జనులారా !
చీమకుట్టదె మీకు జనులారా !

17. బక్కచిక్కిన తెగులె బలిసిపోయిన తెగులె
బాధకై యల్లాడి పరులవేడగ నేల ?
పాడిపంటలభూమి జనులారా !
వైద్యంబు సేయదే జనులారా !

18. ఎచటపుట్టినవారి కచట బుట్టినచెట్టు
ఎచటబెరిగినవారి కచటి యాచారంబె
ఆరోగ్య మొసగూర్చు జనులారా!
ఆయురభివృద్ధి నిడు జనులారా!

19. నీరుమారిన శిరోభారమని మూల్గెదరు
పొరిగింటి తిండియే సరిపడదు మాకంద్రు
దూరదేశపు మందు జనులారా!
కోరి భరియింతురే జనులారా!

20. నిత్యయావనముతో నిలిపి వేయేండ్లుగా
దేవదేవుని దెలియుదృష్టి నీ యంజాలు
వైద్యంబు మీయందె జనులారా!
ప్రభవించి వర్ధిల్లె జనులారా!

21. ఆవైద్య మీవైద్యమని పేరుమోగేటి
అఖలవైద్యముగన్న యమ్మ యాయుర్వేద
మాసేవయే సుఖము జనులారా!
ఆత్మ విశ్వాసులౌ జనులారా!

22. ఆరోగ్యసూత్రమ్ము లాటగా బాటగా
ఉగ్గుబోసిననాడె ఊకొట్టు గాజేసె
ఆవైద్యమే సుఖము జనులారా!
అన్య వైద్యంబేల? జనులారా!

23. నిజచందనపుబూత నేయిచిలికిన తిండి
నియమతాంబూలంబు నిత్యంబు మీకుండి
ఆ క్రిములు నీ క్రిములు జనులారా!
అల్లతల్లడ మిడునె జనులారా!

24. రాజుమారినబెద్ద రాజ్యాలు మారినను
శ్రుతిని ఆయుర్వేద సిద్ధాంతమేనిలుచు

ఆత్మ తత్వమునుండి జనులారా !
అవతరించిన దిదియె జనులారా !

25. ఋషికుమారులనుంచు ఋషి గోత్రములుచెప్పి
ఋషిమూర్తులనుగొల్చి ఋషి సూత్రములువల్క
ఋషుల కాదలపోయు జనులారా !
ఋషుల వాక్యమె శుభము జనులారా !

---

# సారూప్య జీవరసాయన శాస్త్రము

## (మందులనుచేయు విధానము)



సూత్రములు:—వైద్యుల సౌకర్యార్థము సూత్రములను ముందు తెలియపర్చి, ఔషధములు జేసికొనుటకు ఏయే సూత్రము, ఏయే ఔషధమునకు పనికి వచ్చునో, ఆ యా, సూత్రములయొక్క సంఖ్యను సూచింపబడును. అట్టి సంఖ్యగల సూత్రమునను సరించి మందులను జేసికొనవలెను.

### అమెరికను ఫార్మకోపియా (A. P.)

అ. ఫా:— A. P. } 1 వ సూత్రము:— మదరుటింక్చరు MOTHER. TINCTURE. | మందు దినుసు (Medicinal Substance.) ను తూచి, దానికి సరియైన తూకముగల ఆల్కహాలులో వైచి కార్కు బిగించి 8 దినముల వరకు యట్లేయుంచి, తొమ్మిదవ దినమున, దానిని వడకట్టి దీసికొనవలెను. ఇట్లు చేసినపిదప యౌషధముయొక్క బలము సగము ($\frac{1}{2}$) గా యుండును. దీసినే మదరుటింక్చరు (తల్లిమందు లేక ప్రథమౌషధము) యందురు. దీనికి సున్నయొక్క పొట్టలో అడ్డముగా ఒక గీతను వేసిన గుర్తునుంచెదరు ϕ.

ఉదా:—

1x లేక 1 వ డెసిమలు. చేయువిధానము:— తల్లిమందు (Mother, tincture) లోని రెండుభాగము లను, 8 భాగములడైల్యూట్ ఆల్కహాలులో వేసిన యెడల 1x (మొదటి బలము లేక పొటన్సీ.) యగును.

2x లేక 2 వ డెసిమలు జేయువిధానము:—1x లో ఒక పాలును, డైల్యూట్ ఆల్కహాలు 9 పాళ్లను కలిపిన యెడల 2x యగును.

3x లేక 3 వ డెసిమలు జేయువిధము:—2x లో ఒక భాగమును, డైల్యూట్ ఆల్కహాలు 9 భాగములను కలిపిన యెడల 3x యగును.

ముఖ్య గమనిక:—మిగిలిన భాగములన్నియును ఒక పాలునకు 9 పాళ్లవంతున ఆల్కహాలుతో మాత్రమే జేసికొనవలెను.

1 C లేక 1 వ సెంటిసమలు జేయువిధానము:—మదరు టింక్చరు రెండు పాళ్లను, 98 పాళ్ల డైల్యూట్ ఆల్కహాలులో జేర్చిన యెడల 1 వ సెంటిసమలు (1c.) యగును.

2c లేక 2 వ సెంటిసమలు జేయువిధానము:—ఒకటవ సెంటిసమలులో ఒక పాలును, 99 పాళ్ల ఆల్కహాలుతో జేర్చిన యెడల 2 వ సెంటిసమలు (2c.) యగును. ఇట్లు ప్రతి సెంటిసమలును జేసికొనవలెను.

అ. ఫ. A. P. 2 వ సూత్రము:—మూడు భాగములమందు దినుసును, రెండుభాగముల ఆల్కహాలులో వేసి తొమ్మిది దినములుంచిన యెడల దానిబలము (పవరు.) అర $\frac{1}{2}$ యగును. అనగా మదరుటింక్చరుయొక్క శక్తి సగము.

1x చేయువిధానము:—రెండుపాళ్ల మదరుటింక్చరును 8 పాళ్ల డైల్యూటు ఆల్కహాలులో జేర్చిన యెడల 1x యగును.

2x జేయువిధానము:—ఒకపాలు 1x ను 9 పాళ్ల డైల్యూటు

ఆల్కహాలులో చేర్చినచో 2x యగును. మిగిలిన x లన్నియు (అనగా పైభాగములు.) ఆల్కహాలుతో మాత్రమే జేయవలెను.

1 c. జేయువిధానము:— 2 పాళ్లు మదరుటింక్చరును 98 పాళ్ల డైల్యూటు ఆల్కహాలుతో గలిపినయెడల 1 c. యగును.

2 c. జేయువిధానము:— 1c లో ఒకపాలును 99 పాళ్ల ఆల్కహాలుతో కలిపినయెడల 2 c. యగును.

సశేషము.

---

# ఉబ్బసము - సల్ఫరు

యం. వెంకటారావుగారు, పెంటపాడు.

## గీతమాలిక

మూడు సంవత్సరమ్ముల యీడులోన
శ్వాస కాసల పెన్వ్యాధి బారికగ్గ
మయ్యె బాలకుడొక్కరుడతని యెడల
సుప్రసిద్ధాంగ్ల వైద్యుల నూదిపోటు
పాటు పోటులకంటె లాభమ్ము లేక
పోయె, నానాటికిని చిక్కిపోవుచుండ
అరిగెనీరీతి మాసమ్ము లైదు నొకటి
అంత నాహూయ మానుండ నగుచు నేను
వెడలి చూచితి, ఒడలిపై చిదుముమచ్చ
లుండె, యేడాదిలోన వైద్యం బొకండు
చిదుము తగ్గించె పైపూతచే తననుచు
చెప్పిరలవారు, యొడలెల్ల స్వేద మొదవు
నప్పు డుపశమించుచునుండు, అకలి, మల

బద్ధము, శిరోతలము వేడి, పాదములను
చల్లదనమును యెక్కుడీ యెల్లగుణము
లరసి, ముప్పది పవరు 'సల్ఫరు' యొసంగ
క్రమముగా వ్యాధితగ్గు మొగమ్ము బట్టి
లేవదొడగెను మున్పటి రీతిగజ్జి
ఉబికె నెలనాటి కీగజ్జి, ఉడిగె బాధ
మరల మోతాదు నీయగ మాసమునకు
క్రమముగా నన్నియును తగ్గి గాంచె సుఖము.

---

## HOMOEOPATHIC METERIA MEDICA IN TELUGU VERSE.

### ఫాస్ఫరస్. (Phosphorus.)

పమ్మి రామశాస్త్రిగారు. పెంటపాడు.

నెగులు మూత్రావయవము గుండెయును
శ్వాసకోశముల యందుగలుగ వ్యాకులముగలుగు,
నెట్టుకొని మంటలెల్లెడ బుట్టుచుండు,
పెరుగుచుండును ఒడలతి త్వరితగతిని.

వణకు తోడుత నిస్త్రాణ పరిఢవిల్లు
ప్రబలి నొప్పించు శోణిత స్రావమునయు
కూర్కు పిమ్మటవ్యాధి ప్రకోపమందు
ఎడమవైపున నిదురింప నేవగలుగు.

బిగియు వక్షంబు; శ్వాసంబు చెడిదమగును,
కోరికజనించు చల్లని నీరు ద్రావ
త్రాగినది వెచ్చబడిన తత్క్షణమె వెలలు
వెడదయగు పాయు వతిసార మెడయకుండు.

హారముంగొన్న, నీర్గావి నప్పుడైన
వ్యవధిలేక విరేచనా లగుచునుండు
కండ్లకన్నియు నెఱ్ఱగా గానబడును
ఉఱుము మెఱుపనగనె భయంబుప్పతిల్లు
సిగ్గు బిడియంబు లనునవి తగ్గిపోవు
ననిన బిల్వాడు "ఫాస్పరస్స" నెడినన్ను !

# నూతన విద్యావిధానము - వైద్య విద్య

వి. వే. సు. అవధానులు, నూజవీడు.

ఇప్పటి మన ప్రభుత్వమువారు విద్యా విధానమున పెద్ద పెద్ద మార్పులు చేయుచున్నారు. విద్యాభ్యాసమునకు తఱియైన వయస్సును, జీవితమున నెందుకును బనికిరాని విషయములతో వ్యర్థముగా పుచ్చక, జీవితోపయోగి విషయ బోధనము కొంతయైన నుండవలయునని గమనించిరో యన్నట్లు, క్రింది తరగతులందే 'వృత్తివిద్య' ను చేర్చు తలంపుతో, నాలుగవ ఫారమునుండియే విద్యార్థులు 'ఎంజినియరింగు' 'ఎగ్రికల్చరు' మున్నగు విషయముల నభ్యసించుట కవకాశము గల్పింపఁ దలఁచినారు. ఈ తలఁపు సమంజసముగనే యున్నది. కాని వానితోపాటే వైద్యవిద్యను గూడ నభ్యసింపఁ జేయుటవలని లాభములను గమనింపక పోవుట సమంజసముగా లేదు. ఆ లాభము లేవో చూతము.

1. ఇప్పటి పద్ధతిని మిడిల్ స్కూలు చదువు ముగిసిన తరువాత, (స్కూల్ ఫయినలు చదువు మూఁడేండ్లును, ఇంటెర్ మీడియెట్ చదువు రెండేండ్లును కాఁగా) ఐదేండ్లు సామాన్యవిద్య (General Education) కును, అటు పిమ్మట నైదేండ్లు వైద్యవిద్య (Medical Course) కును కావలసి వచ్చుచున్నది. మొదటి యైదేండ్ల కాలము – ఇంటెర్

మీడియెట్ చదువు ముగియుదాఁక తా నేవృత్తికిఁ బోవలయునో విద్యార్థి కెంతమాత్రము తెలియదు. ఒక వంక వైద్య కళాశాలకును, మఱొకవంక ఎంజనియరింగు కళాశాలకును, ఇంకొకవంక ఆనర్సు కోర్సునకును, వేఱొకవంక వేఱొక కోర్సునకు సీట్లకై ప్రయత్నము చేయఁగా, నెచట సీటు లభించిన నచట చదువఁ బోవుటయే కాని, ప్రత్యేకముగా నొకానొక విషయమునం దభిరుచి యుండుటవలన చదువుట జరుగుట లేదు. ఇట్టి 'అగోచర' స్థితినుండి వైద్యకళాశాల లోని కురికిన విద్యార్థి, వైద్యుని కుండవలసిన మన స్తత్వమును అల వాట్లును కర్మప్రథాభ్యాసము (Practical Training) ను అలవఱచు కొనుట కైదేండ్ల కాలము మిక్కిలి తక్కువదే యగును. అట్లుకాక యీ ఐదేండ్లలో జరుగు వైద్యవిద్యాభ్యాసమే పదేండ్లలో జరుగు నెడల, విద్యార్థి వైద్యుఁ డగుటకు నిశ్చయించుకొన్న పిదప పదేండ్లు విద్యాభ్యాసము చేయువాఁడగును. అంత కాలము పాటతఁడు వైద్యుఁ డగు ప్రయత్నముననే యుండుటచే చక్కఁగా వైద్యత్వమును పొందు టకు కావలసినంత వీలు కలుగును.

2. పైనిఁ జెప్పినట్లు మొదటి యైదేండ్లలో సామాన్యవిద్య నభ్యసించుట యైన వెనుక వైద్యవిద్య నభ్యసించుచో నీ రెండింటి కినిఁ గల పరస్పర సంబంధము మనస్సునకు బాగుగా పట్టక తీర్థము నకు తీర్థమును ప్రసాదమునకు ప్రసాదమును నగును. రెండును నొక దానితోపాటు మఱొకటిగా (Side by side) నభ్యసించుచో, విద్యార్థికి, సామాన్యవిద్యలోని 'సైన్సు' మున్నగువానికి తా మభ్య సించు వృత్తి విద్యతోఁ గల సంబంధము (Application) బాగుగా బోధపడును.

3. మనోవిజ్ఞానమును బట్టి (Psychology నిబట్టి) థియరెటికల్ అనాటమీ Theoritical Anatomy) బాగుగా బోధపడిన పిమ్మటనే ప్రాక్టికల్ ఎనాటమీ (Practical Anatomy)బోధించుట యుక్తము. అంతేకాని ఆ రెండింటి నొకదానితోపాటు • మఱొకటిగా (Side by Side) బోధించుట యుక్తముగాదు. ఈవిషయమును గమనింపకయో,

గమనించియు విద్యాభ్యాస కాలము కొంచెమే (Congested) యగుట చేతనో ప్రస్తుత మీ రెండింటి నొకేసారి బోధించుచున్నారు. అట్లు ఎన్నాటమీ బాగుగా బోధపడిన పిమ్మటనే ఫిజియాలజీ (Physiology) బోధించుట సంగతము. కాని ప్రస్తుతము వీని నెల్ల కలగా పులగముగా బోధించుచున్నారు. సరియైన క్రమమున చదువు జరగ వలయు నన్న, విద్యాభ్యాసకాలమును పెంచవలయును. అందులకు ఉత్తమమైన మార్గము, సామాన్య విద్యను వైద్య విద్యను ఒండొరులతో పాటు (One along with the other) కరపుటయే యగును.

అసలు ఇట్టిలాభముల నొక్కొక్కటిగా వేర్వేఱ నిట వివరింపనే యక్కఱ లేదు. ఏ ప్రయోజనములను ఏలాభములను ఏ సౌకర్యమును అభిలషించి ఎంజినియర్రింగ్, కృషి (అగ్రికల్చర్), వాణిజ్యము (Commerce) (Secretcrial course) అను వాని చదువు నాలుగవ ఫారమునుండి ప్రారంభింప నిశ్చయించిరో ఆ ప్రయోజనములను ఆలాభములను ఆ సౌకర్యమును గమనించియే మెడికల్ కోర్సును గూడ ప్రారంభింపఁ దగు నని ఒక్కమాటలో చెప్పుట చాలును. ఎంజనియర్రింగున కక్కఱ లేక పోయినను వైద్యవిద్యకు మాత్రము, ముందుగా సామాన్య విద్యను ముగించుకొని సైన్సు మున్నగువానిని నేర్చుకొని యుండు టావశ్యకమనుటకు వీలు లేదు. ఆ దృష్టితోఁ జూడ వలసినచో, సైన్సు తెలియకుండ — ముఖ్యముగా ఫిజిక్సు తెలియ కుండ — ఎంజినియర్రింగే బోధపడ దన వలసి యుండును. దానిని బోధించుటకే యభ్యంతరము లేనప్పుడు, వైద్యవిద్యను బోధించుట కభ్యంతర మసలే యుండఁ గూడదు.

ఇట్లు వైద్యవిద్యను గూడ స్కూలు చదువులో చేర్చినచో, స్కూల్ కోర్సున, ఏ అలోపతియో ఆయుర్వేదమో మాత్రము బోధించుటకంటె, అలోపతీ ఆయుర్వేద సిద్ధయునానీహోమియోపతీ ప్రకృతి విధానము లనెడి యాఱింటియొక్కయు పరిచయము కలిగించుట మంచిది. మఱొక దృష్టిచేఁ జూచినచో, అలోపతీ కాక

తక్కిన యైదు విధానములలో దేనికే నొకదానికి సంబంధించిన చదువు నన్నే చదివింప వచ్చునని తోఁచెడిని.

ఇట్లన్ని విధానములయు పరిచయము గలిగించు నెడల, నే విద్యార్థి కేవిధానమునం దభిరుచి కలిగిన నావిద్యార్థి యావిధానమున విశేషాధ్యయనము చేసికొనఁగా, తక్కినవాని పరిచయము, ఒక్కొక్క వైద్యవిధానమునందు తదనుయాయుల కిప్పు డేర్పడి యున్నట్టి వ్యర్థ దురభిమానము గలుగ నీయక, రోగారోగ్య వివేచనమునందును చికిత్సా ప్రక్రియ లందును సక్రమమార్గ మనుసరింపఁ గలుగుటకై వలయు కనువిప్పును, 'విశాలభావమును' గలిగించుట కుపయోగ పడును.

ఇయ్యెడ గమనింపఁ దగిన మఱొక విశేష మేమన, ఆయా వైద్య విధానమునుగూర్చి బోధించుటలో, విద్యార్థులకు, వాని మూల సిద్ధాంతముల తత్త్వము చక్కఁగా నవగతము కావలయు నని యాశింప వలయునే కాని, వానిని వారాచరణమున వాడుకొన వలయునని యాశింపఁ గూడదు. డా. లక్ష్మీపతిగారు వెనుక గాంధిగారితో మాట్లాడుచు, "ఆలోపతీ వైద్యుల కాయుర్వేదము కూడ (కొలది కాలముపాటు) బోధింప వలె" ననఁగా, గాంధిగారు, కొలదికాలమున ఒకానొక శాస్త్రమును నేర్పుట సాధ్యపడదను నభిప్రాయముతో, "కేటలాగు వైద్యము నేర్పవలెనని మీ యభిప్రాయమా?" యని యడిగిరఁట. అందుచే నాయుర్వేదము కొంత నేర్పుట యనఁగా, వాతవిధ్వంసి సూర్యావర్తి మున్నగు నే కొన్ని మందులనో వాడ నేర్పుట కాక, త్రిదోష సప్తధాతు సిద్ధాంతములు, ఆయుర్వేద సమ్మత ద్రవ్య విజ్ఞాన శారీర విజ్ఞానములు మున్నగువానిని బోధించుటయే యగును. అట్లే ఆలోపతీ కొంత నేర్పుట యనఁగా, M. B. 693 బిళ్ళలో సిబజాలు బిళ్ళలో క్వైనైనో ఏస్పిరినో వాడనేర్పుట కాక, ఆలోపతీ విశిష్టముగా గనుగొన్న యంత్ర శాస్త్రాదుల వాడ నేర్పుటయు, సవివరముగ ప్రత్యేక విజ్ఞానము (Science) లుగ వెలయించిన ఎనాటమీ మున్నగు వానిని చదివించుటయు నగును. అట్లే

ప్రకృతి వైద్యము నేర్పుట యనఁగా రంగునీళ్ళు వాడుటో తొట్టి స్నానము చేయుటో నేర్పుట కాక, తత్సిద్ధాంతము ననుసరించి రోగారోగ్య వివేచనము చేయు పద్ధతులను సంపూర్ణముగా బోధించుట వంటివే యగును.

ఈ నిర్ణయమునుబట్టి యాయుర్వేదమునకు పఠనీయ గ్రంథములుగా నేర్పఱుపఁ దగినవి.

1. అష్టాంగ హృదయ సూత్రస్థానము (1, 2, 3, 9, 11, 12, 13, 14, 16, 17 అధ్యాయములు)

2. ఆయుర్వేదాంగ ద్రవ్య విజ్ఞాన శాస్త్రము

3. ఆయుర్వేదాంగ శారీర శాస్త్ర సంగ్రహము మున్నగునవి యగును. అల్లే అలోపతీకి,

1. ముస్తఫీ వ్రాసిన (థియరిటికల్) అనాటమీ

2. కెమిస్ట్రీ ఫిజిక్సులకు సంబంధించిన ఆవశ్యక ప్రారంభ విషయములు తెలుపు పుస్తకములు మొదలగునవియు, ప్రకృతి వైద్యమునకు,

1. రోగారోగ్య వివేకము

2. ముఖవైఖరీ విద్య

3. పచ్చితిండివలని ప్రయోజనములు

4. ప్రకృతి గృహవైద్యము

మొదలుగాఁగల గ్రంథములును పఠనీయములు కాఁ దగియుండును. ఇట్టి పద్ధతినే హోమియోపతీ మున్నగు తక్కిన విధానములకు చెందిన పాఠ్య గ్రంథములు కూడ నిర్ణయింపఁబడఁ దగును.

ఇట్టి యీ స్కూలు కోర్సుతో మొదలిడు వైద్యవిద్య మూఁడు భాగములుగాగానిఁ రెండు భాగములుగాఁగాని విభజింపఁబడవచ్చును. ఈ స్కూలు కోర్సును, మూఁడేండ్ల కోర్సుగాఁ జేసినచో, దాని పిమ్మట నాలుగేండ్ల లైసెన్షియేట్ కోర్సొకటియు, దానికి తరువాత మూఁడేండ్ల (Bachelor) కోర్సొకటియు నేర్పఱుప వచ్చును. ఈ స్కూలు

కోర్సును నాలుగేండ్ల కోర్సుగాఁజేసి పై కోర్సును 4, 2 ఏండ్లవియగు రెండు కోర్సులుగా జేయవచ్చును. లేదా నాలుగేండ్ల స్కూలు కోర్సును, అటు వెనుక ఆరేండ్ల కాలేజి కోర్సును మాత్రము ముందునట్లు చేయవచ్చును.

ఇట్టి వివరముల (Details) మాట యెట్లున్నను, వైద్యవిద్యను గూడ స్కూలు కోర్సునందుఁ జేర్చుటయు, అందన్ని విధానములయు మూల సిద్ధాంతములను బోధించు పద్ధతిని పాఠ్య విషయ (Syllabus) నిర్ణయ మొనర్చుటయు నావశ్యములని విద్యా విధాన నిర్ణేతలును ప్రభుత్వమువారును గూడ గమనించుట ముఖ్యము.

---

# ప్రకృతి వైద్యము.

సూర్యకాంతి తగులని మొలకలుకాని, యితర జీవరాసులు గాని పాలిపోయి జీవశ్శక్తి నశించియుండును. సూర్యరశ్మి తగులక యుండువారికి, రక్తక్షయము, కండరపటుత్వముక్షీణించుట, నీరసము, గుండె నీరసము, కాలేయబాధలు, ఉబ్బరోగము, ఎముకలు మెత్తనగుట, నరముల నిస్త్రాణ, మొరగుజ్జుతనము, పిట్టదోషము, (చిక్కిపోవుట) క్షయ మొదలగు దారుణరోగములు గలుగుచుండును.

శరీరమునకు సూర్యకిరణములను తగులనిచ్చినచో తేజస్సు గలుగును. నరములకు తేజముగలిగి రక్తప్రసరణము బాగుగఁ జరుగును. చర్మమునకు దృఢత్వమును గలిగించును. లోపలిఅవయవముల యొక్క వాపులను పోగొట్టును.

కేవలము సూర్యకాంతినే శరీరమునకు ప్రసరింపజేయుచుండిన యెడల యితరరంగు కాంతులకంటె మిక్కిలి యుపకరించును. ఏలన సూర్యకాంతియందు అన్నిరంగులును సమానభాగములుగనుండి శరీరమునకు మిక్కిలిగా నుపయోగపడును. కాని వేసవికాలమునందు

మాత్రము సూర్యరశ్మియందు అధికోష్ణముండును గనుక అట్టితరి శిరస్సునకు కిరణములు తగులకుండ శరీరభాగములకు స్వల్పముగ తగులునట్లు జాగ్రతవహించవలెను.

మనము భుజించెడు కూరగాయలకు సూర్యకిరణములను ప్రసరింపజేసి, కాంతిని, రంగులద్దములద్వారా శరీరమునకు తగుల నిచ్చినయెడల సూర్యకిరణములందలి తీక్ష్ణతను తగ్గించి సాధుత్వముగా పనిచేసి రోగోపశాంతిని గలిగించు లక్షణములను గలిగియుండును.

హెచ్చరిక:—త్రాగుడు మొదలగు మత్తుపదార్థముల కలవాటుపడినవారును, పుగాకు అలవాటుగలవారును, సూర్యుని వేడిమి కిట్టక తలనొప్పి లేక త్రిప్పు మొదలగు బాధలనొందువారును, ప్రారంభముననే సూర్యకాంతియందుండక, రంగులకాంతిని అలవరచుకొనుట శ్రేష్టము.

---

# రంగులు.

(1) ఎరుపు. (2) పసుపు. (3) నీలము:—యను మూడును ప్రధానవర్ణములు. వీటినుంశి మిగిలిన రంగులు యుత్పత్తియగుచున్నవి. వాటి వివరములను దెలిసికొనుటకూడ మనకు అవసరము.

(4) వ రంగు నారింజవర్ణము:—ఎరుపురంగును, పసుపు రంగును సమానభాగములుగాకూడినయెడల యీరంగు పుట్టుచున్నది. అయిదుభాగములు యెరుపును, మూడుభాగములు పసుపురంగును చేర్చినచో చక్కని నారింజవర్ణము గలుగును.

(5) వ రంగు ఆకుపచ్చ:—నీలము, పసుపురంగులు రెండును సమానభాగములు చేర్చుటవలన గలుగుచున్నది. ఎనిమిదిభాగములు నీలమును, మూడుభాగముల పసుపుతోకూర్చినచో మంచి ఆకు పచ్చ పుట్టును.

(6) వ రంగు గాఢమైన ఊదా:—ఎరుపు, నీలము, సమాన భాగములుగ చేరినపు డిది గలుగుచున్నది. ఎనిమిదిభాగములునీలము,

అయిదుభాగములు యెరుపును కలిపినచో శ్రేష్టమగు ఊదా రయారగును.

(7) వ రంగు ఊదా:—ఇది యెరుపుకొంచెముగను, నీలమధికముగను గలుపుటవలన పుట్టుచున్నది.

పైరంగులుగాక మిగిలినరంగులయొక్క పుట్టుకనుగురించికూడ తెలుసుకొనుట అగత్యము కనుక ఆ విషయముసుకూడ యీదిగువ నుదహరింపబడుచున్నది.

(8) వ రంగు నలుపు:—సమానభాగములుగా యెరుపును నీలమును, పసుపును కలిపినచో యీరంగు పుట్టును.

(9) వ రంగు తెలుపు:—ఇది అయిదుభాగములు యెరుపును, మూడుభాగములు పసుపును, ఎనిమిది భాగములు నీలమును చేర్చుటచే గలుగునట్లు "బాబిట్" యనునాతడు చెప్పుచున్నాడు.

(10) వ రంగు వెలిబూడిదరంగు (Grey):—ఇది తెలుపును, నలుపును సమాంశలుగా చేర్చినపుడు గలుగును.

(11) వ రంగు గులాబి (Rose or Pink):—ఇది యెరుపు తెలుపు సమాంశలుగా కలిపినచో పుట్టును.

(12) వది నీలిమందురంగు (Indigo):— నీలము, ఊదా కలిసినపుడు కలుగును.

(13) మిక్కిలి నీలిరంగు (Mazarine):— దీనియందు. కొంలది యెరుపు గలసియుండును.

(14) ఎరుపు నారింజవర్ణము:— ఎరుపు యధికము, నారింజ స్వల్పము గలసినపుడీరంగు పుట్టును.

(15) పసుపు నారింజవర్ణము:—పసుపు అధికము, నారింజ స్వల్పముతో గలసినపుడిది గలుగుచున్నది. ఇట్లు కూడికవలన రెండు వేలరంగులు గలుగుచున్నట్లు "డాక్టర్ బాబిట్" అను మహానీయుడు వ్రాయుచున్నాడు. సశేషము.

---

# నాడీ మీమాంస

## వైద్యుని కర్తవ్యము.

శ్లో॥ ప్రాతః కృతసమాచారః - కృతాచార పరిగ్రహమ్
సుఖాసీనస్సుఖాసీనం - పరీక్షార్థ ముపాచరేత్॥

వైద్యుడు ప్రాతఃకాలమునందు, తనకు నిర్ణయింపబడిన, స్నానసంధ్యావందనాది కృత్యముల నొనర్చుకొని పరిశుద్ధుడై, రోగి కడకేగి, రోగిని సుఖాసీను నొనర్చి, తానుకూడ సుఖముగ కూర్చున్న వాడై రోగనిదాన మొనరించ వలెనని పై శ్లోకభావము.

ఆయుర్వేద వైద్యులందిట్లు నూటికొక రైనను గలరా యను సందియము గలుగుట వింతగాదు. పైప్రకారము పరిశుద్ధుడై రోగిని పరీక్షించినచో ఔషధ ప్రయోగముతో నిమిత్తము లేకుండనే కొంత వ్యాధి ఉపశమమై తీరును. ఇట్టి శక్తి, వైద్యుడు పరిశుద్ధ మనస్కుడై ఆచరించెడు కృత్యముల వల్లనే గలుగుచున్నది. దీనినే వశీకరణశక్తి యని కొందరును, హిప్నోటిజం, మెస్మరిజం యను నామాంతరము లచే మరికొందరును వాడుచున్నారు.

పై ప్రకార మాచరించుటచే మానసిక శక్తి యభివృద్ధియై, వాక్శుద్ధిగలిగి, సంకల్పించి నంతమాత్రముననే, రోగముల బాపగల శక్తియు నభివృద్ధి నందును.

శ్లో॥ స్థిరచిత్తః ప్రశాన్తాత్మా - మనసాచ విశారదః
స్పృశేదంగుళి భిర్నాడీం - జానియ్యా దక్షిణేకరే॥

నేర్పరియగు వైద్యుడు, నాడిని పరీక్షించు నపుడు, స్వస్థ చిత్తుడై, (ఆత్మను మనస్సును శాన్తి పరచుకొని) రోగియొక్క కుడి చేతిని, తన మూడు వ్రేళ్లతో పట్టి దోషమును తెలిసికొనవలెను.

శ్లో॥ యోరోగిణః కరం స్పృష్ట్వా - స్వకరం క్షాలయేద్యది
రోగాస్తస్య వినశ్యంతి - పంక ప్రక్షాళనా ద్యథా॥

రోగియొక్క చేతిని (నాడిని) చూచిన పిదప వైద్యుడు తన చేతిని కడుగుకొన్నయెడల, నారోగియొక్క వ్యాధులు నశించునని పై శ్లోకభావము.

చూచితిరా యీశాస్త్ర మర్యాద! ఇట్టి విధముగ నెవరేని ఆచరించుచున్నారా? అంటువ్యాధుల విషయములో మాత్రము తమకు సంక్రమించునని భయముచే, పాశ్చాత్య పద్ధతిని తమ చేతులను సబ్బుతో కడుగుకొనుట తప్ప, రోగికి నారోగ్యము కలుగ వలెననెడి సదుద్దేశ్యముతో చేతులను కడుగుకొనుచున్నారా? అట్లా చరింపపోవుటకు కారణ మూహింప, శాస్త్ర పరిచయము లేకుండుటయేనని విశదమగును.

శ్లో॥ ప్రాయస్స్ఫుటా భవతి - వామకరే వధూనాం
పుంసాంచ దక్షిణకరే - తదీయం పరీక్షా॥

స్త్రీలకు యెడమచేతియందును, పురుషులకుకుడిచేతి యందును, నాడి స్పష్టముగ నుండునుగాన, ఆ ప్రకారము నాడిని పరీక్షింప వలెను.

శ్లో॥ స్త్రీణామూర్ధ్వముఖః కూర్మః - పుంసాంపున రధోముఖః
అతః కూర్మ వ్యతిక్రాంతా - త్సర్వ త్రైవవ్యతిక్రమః
లక్ష్యతే దక్షిణేపుంసాం - యాచనాడీ విచక్షణైః
కూర్మభేదేన వామానాం - వామేచైవాలోక్యతే.

స్త్రీలకు నాభికూర్మము ఊర్ధ్వముఖముగను, పురుషులకు అధోముఖముగను, యుండుటచే స్త్రీ పురుషుల నాడులు వ్యత్యాసముగనుండును గాన స్త్రీలకు యెడమ చేతియందును, పురుషులకు కుడిచేతియందును నాడిని పరీక్షింపవలెను.

శ్లో॥ సద్యస్స్నాతస్య భుక్తస్య - తథాస్నేహావగాహినః
క్షుత్తృడార్తస్య సుప్తస్య - నాడీసమజ్ఞ బుధ్యతే.

స్నానము జేసినవారికి, భుజించినవారికి, శరీరమునకు చమురు బూసికొనినవారికి, ఆకలి దప్పులు గలవానికి, నిద్రించుచున్న వారికి

నాడి స్పష్టముగా కన్పించదు. కావున యట్టి వారిల నాడులబరీక్షించి రోగనిరూపణ జేయరాదు.

శ్లో॥ తైలాభ్యంగే చసుప్తేచ - తథావైభోజనాన్తరే
తథానజ్ఞాయతే నాడీ - యథా దుర్గతరానదీ.

తైలాభ్యంగ మొనర్చుకొనిన వానికిని, ఆకలితోనున్న వానికిని, భుజించినవానికిని, నాడి యతిగంభీరముగు నదివలె దెలియుంబడదని మతాంతరము.

శ్లో॥ వ్యాయామ తృష్ణాతపపీడితస్య భుభుక్షితో భుక్తవతో హిజంతో
అభ్యంజనస్నాన వధూప్రయోగ క్రియాసునాడీ నవిబోధనీయా.

శరీర వ్యాయామము, దప్పి, యెండ యనువాటిచే పీడింపబడిన (బడలిన) వానికిని ఆకలితో నున్న వానికని అభ్యంజన మాచరించిన (తలంటుకొనిన) వానికిని, సంభోగించిన వానికిని, నాడి సరిగా తెలియదుగనుక నట్టి సమయములందు నాడిని పరీక్షింపరాదు.

సశేషము.

---

# 'అశ్విన్' యోగ్యతా పత్రము.

శ్లో॥ ఆంధ్రదేశేసు ప్రసిద్ధ । సుధీపూజ్య గుణాత్మక
నామ ప్రసిద్ధ నరసింహా । శబ్ద వెంకటపూర్వక ॥

శ్లో॥ గొడవర్తి వంశజలధే రమృతాయమాన
చేబ్రోలునామక పురస్థిత గేయమాన
ఆంగ్లేయవైద్య నిపుణ ప్రియమాదధాన
సారూప్యవైద్య సరసం సతతం సమజ్ఞ ॥

శ్లో॥ ఏకస్మిన్ రచనం వైద్యే । కష్టం పుస్తక మన్యతు
దథాపి చత్వయా సమ్యక్ । కథితం పుస్తకం త్రిషు ॥

ఏవంబుధజన విధేయః,

ఆణివిళ్ల చినవెంకటశాస్త్రి (కాకరపర్రు)

| | | |
|---|---|---|
| అశ్విన్ : | ప్రథమ భాగము:— చికిత్సా ప్రకరణము | రు 5—0—0 |
| ,, | ద్వితీయ భాగము:— ఔషధ ప్రకరణము | 4—0—0 |
| ,, | ఇంజంక్షన్ విధానము (అలోపతి) | 3—0—0 |
| ,, | అనుబంధము (దీర్ఘవ్యాధుల చికిత్సలు) | 2—8—0 |
| ,, | ఆంగ్లేయౌషధ గుణదీపిక | 1—0—0 |
| ,, | ఆయుర్వేద అనుభూత యోగావళి | 1—0—0 |
| ,, | నాడీ మీమాంస | 0—12—0 |

వలయువారు:— డాక్టరు బ్రదర్సు,

(P. O.) చేబ్రోలు ప॥ గో॥ జిల్లా.

అని వ్రాయవలెను.

రిజిష్టర్డు నం. M-    సాలు చందా రు 3-0-0



ఏలూరు శ్రీ పాండురంగ ముద్రాక్షరశాలలో ముద్రింపబడి
శ్రీమాన్ జి. వెంకట నరసింహాచార్యులు గారిచే ప్రకటింపబడినది.